# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

### సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 రాజమహేంద్రవరము 1-2-1979 సంచిక

—* ఈ సంచికలో *—



16—2—79 సంచికలో మాఘుని కావ్యనిర్మాణ దక్షత, చంపకమాల మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి

# తిక్కన - మోక్ష నిర్వచనము

- శ్రీ మోపిదేవి కృష్ణస్వామి, ఎం. ఏ.

కలలో ప్రత్యక్షమైన హరిహర నాథుడు తిక్కయజ్వకై మోడ్పు లంగొని అతనిపై కరుణామృతమును వర్షించుచూ మున్ముందుగా నతని పరిపూర్ణ యోగజీవనమును ప్రశంసించినాడు. భారతమును తెనుగున వినిర్మించవలె నన్న తిక్కన పవిత్ర సంకల్పమును మెచ్చుకొని కృతిపతిత్వమును అర్థించినాడు

హరిహరనాథుని సాన్నిధ్యమునకు సరస సంభాషణమునకు తిక్కన పులకించి పరవశించినాడు. స్వామికి సాష్టాంగ నమస్కారము చేసి అంజలిఘటించి యెదనిండ నిండిన సంతోషముతో సువినయముగ నిట్లనినాడు "ప్రభూ! గొప్పదైన నీ కారుణ్య మనెడి క్షీరసాగరమున నామనస్సును నిలిపియుంచితివి చూడగా నింతకన్న ఆశ్చర్యమేమున్నది ఇంతటిస్థితిని అనుగ్రహించిన నీకు నా వాక్కునకు వైభవము కల్గించునట్టి నిన్ను కొనియాడునట్లు చేయుట యేమంత పెద్ద విశేషమా? నీ కరుణ వలన ఇట్టి పదమున నిలువబడితిని. ఇంక జన్మాంతర దుఃఖములను తొలగునట్లుగ చేసి సుఖాత్ముని చేయవలసినది" అని లాలింపబడిన బాలుడు తన కొలదిని మరచి మహాపదార్థమును వేడినట్లు హరిహర నాథుని వేడితినని అనుచున్నాడు తిక్కన. సాష్టాంగ నమస్కారమాచరించి, అంజలిఘటించి చెంత నిలచినాడు.

జన్మాంతర దుఃఖములు తొలగినచో మానవుడు సుఖాత్ముడు కాగలడని బ్రహ్మానంద స్థితి ననుభవింపఁగలఁడని ఈ సందర్భమున చెప్పబడినది. జన్మాంతర దుఃఖము అనగా నేమి? ప్రతి జీవియు ప్రస్తుత జీవితమున పూర్వవాసనల ననుసరించును. తదనుగుణమౌ ప్రవర్తనమును అతని పూర్వవాసనలు పరిపాలించుచుండును

ఇంద్రియములతో కూడిన మనస్సు చిత్త మనబడును. చిత్తము పూర్వసంస్కారముల ననుసరించి ప్రస్తుత వాతావరణములో మంచిగనో, చెడుగనో ప్రవర్తించుచుండును. ఆ ప్రవర్తన జీవిచేతులలో నుండదు. ఆ చిత్తవృత్తి చేతులలో ఈ జీవియుండును. అట్టి చిత్తవృత్తిని నిరోధించి 'తాను' నిలుచుట నే 'యోగము' అని 'పతంజలి' చెప్పినాడు "యోగశ్చిత్తవృత్తి, నిరోధః" అనికదా పతంజలి నిర్వచనము. చిత్తము వృత్తినుండి విరమింపవలె నన్నచో దైవచింతన అభ్యాసము కావలెను ఇంద్రియ విషయముల యెడ వైరాగ్యము అభ్యాసము కావలెను. అనగా అవశ్యకతలను దాటి కోరికల పేర మనస్సు హద్దులను దాటకుండ నుండవలెను. తన నిజస్వరూపమును (దైవ స్వరూపమును) నిరంతరము గుర్తించుకొనుట అభ్యాసము చేసిన కొలది ప్రవర్తనమున హద్దులు దాటుటయందు కుతూహలము కరిగిపోయి దాటకుండుట యను వైరాగ్యము క్రమముగ అలవడును ఈ మార్గమునే పతంజలి 'అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః'' అని సూత్రీకరించినాడు.

అట్టి అభ్యాస వైరాగ్యములచే చిత్తవృత్తి నిరోధమును పొందుచు జీవితమును పరమార్థమున కంకితము చేసి లోకహితమునకై తన స్వధర్మమును నిర్వహించుచున్న తిక్కన సోమయాజిని మెచ్చి హరిహర నాథుడు స్వప్నమున సాక్షాత్కరించినాడు. అతడు సాక్షాత్కరించుటలో అతని కారుణ్య మనెడి క్షీరసాగరమున తిక్కన చిత్తము నిలుపబడినది అనగా మానవ ప్రయత్న మవసరము లేని దైవానుగ్రహము లభించిన దన్నమాట. అట్టి స్థితిని తన కెల్ల కాలము నిలుచునట్టి అవకాశమును ప్రసాదించ వలసిన దని పూర్వసంస్కారములు కరగిపోగా ఇకపై పూర్తిగా నీ వాహికగా ఈ శరీరమును స్వీకరించి జగద్ధితముగ భారత రచనను జరిపింప వలసిన దని తిక్కన కోరిన కోరిక యొక్క సారాంశము.

తిక్కన కోరిన సహజముగు కోర్కెను మన్నించి హరహర నాథుడు

'జనన మరణాదులైన సంసార దురిత
ములకు నగపడకుండఁగఁ దొలఁగు తెరువు
కను వెలుంగును నీకిచ్చితిని .' అన్నాడు.

'జనన మరణము లనెడి సంసార దురితములకు లోను కాకుండ తప్పుకొని నిత్యానందముతో జీవించు మార్గమును కనగలిగిన వెలుగును నీకిచ్చితిని' అని అనుగ్రహించినాడు స్వామి.

ఇచ్చట జననమరణములు సంసార దురితము అనియు వాని కతీతముగ నుండగలుగటయే మోక్ష మనియు వివరింపబడినది ఇచ్చట చెప్పబడిన జనన మరణములు రెండు విధములు. 1. శారీరకము 2. మానసికము రెండు రకముల జననమరణములకు అతీతముగా నుండగలుగుటయే మోక్షస్థితి. ఈ రెండు రకముల జననమరణములనుగూర్చి కొంచెము వివరముగా పరిశీలింతము

1. శారీరకము - సామాన్యజీవులకు జనన మరణములు తప్పనిసరి అనగా వారు జన్మింపక తప్పదు పూర్వవాసనల ప్రేరణచే వారి ప్రవర్తనము నిండినప్పుడు ఆయాకర్మల ఫలముల ననుసరించి మరల

మరల జన్మించుట జరిగితీరును. అనగా వారి కర్మఫలములకు బద్ధమై వారిజన్మల పరంపర కొనసాగుచుండును ఆ దుఃఖములకు తట్టుకొనలేక ఏదోయొక మార్గమున దైవమును సేవించుట మొదలిడుదురు క్రమముగా దైవస్మరణలో మనస్సు యొక్క మలినములు క్షాళనమై ప్రశాంతి చిక్కుట జరుగును. మనస్సుపై పూర్వ వాసనల కున్న పట్టు క్రమముగా సడలును. ఆపైని యజ్ఞార్థమగు దృష్టితో విశ్వప్రేమ కలిగి జీవించుట మొదలిడిన కొలది తిక్కయజ్వ పొందినస్థితి లభింపగలదు. ఆపైని జీవితమున జగద్ధితముగా సత్కర్మాచరణము నిర్వహింపబడును కనుక బంధ విమోచనము లభించి ముక్త స్థితి అనుభవమగును. ముక్తజీవులకు జన్మించి తీరవలెనను నిర్బంధముండదు జన్మించుట, జన్మింపకపోవుట అనునవి ప్రకృతి వారికే వదలిపెట్టును. ఐనను వారు తోడి జీవుల నుద్ధరించుటకై దేహముల లోనికి దిగివత్తురు. మనచే పూజింపబడు సిద్ధపురుషులు, మహానుభావులు ఈ తరగతికి చెందినవారే! కనుక జనన మరణాది సంసార దురితములకు అగపడకుండ తొలగుట యనగా జనన మరణములచే బంధింపబడక జనన మరణములకు అతీతముగ నుండి దివ్యత్వమును అనుభవించుట యని అర్థము. ఈ విధముగ జనన మరణముల ప్రభావము తమ పైపడని వారిని 'చిరంజీవులు' అని మన సంప్రదాయమున పిలుతురు.

2 మానసికము – జనన మరణములనగా శరీరమునకు సంబంధించిన జనన మరణములే కావు మనస్సునకు సంబంధించిన జనన మరణములు కూడా ఉన్నవి శరీరమునకు సంబంధించిన జనన మరణములను మనవారు సహజములుగనే భావించిరి.

'దేహినోస్మిన్ యథాదేహే
కౌమారం యౌవనం జరా!
తథా దేహాంతర ప్రాప్తి
ర్ధీర స్తత్ర నముహ్యతి'!! (గీత 2-13)
'వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ'
(గీత 2-22)

మానవుడు బాల్యమును, యౌవనమును, ముసలితనమును (మొదలగు మార్పులను) ఎట్లనుభవించుచున్నాడో అట్లే మరియొక దేహమునుకూడా పొందుచున్నాడు. చినిగిన బట్టలను విడిచి క్రొత్తవస్త్రముల నెట్లు ధరించుచున్నాడో అట్లే చితికిన శరీరమును వదలి శిశువై మరల జన్మించుచున్నాడు అని శ్రీకృష్ణుడు సత్యమును సులువుగ బోధపరచినాడు. మనస్సునకు సంబంధించిన జనన మరణములే సంసార దురితములు. వాటి కగపడకుండ తొలగుటయే నిజమగు మోక్షస్థితి. ఈ సందర్భమున కొద్ది వివరణము అవసరము.

సాధకుడు తన మనస్సును దైవముపై లగ్నముచేయును. కొంత సేపటిలో అతనికి తెలియకుండగనే అతని మనస్సు క్రింది లోకములలోనికి జారి (పూర్వవాసనలకు లొంగి) దుఃఖము ననుభవించును. కొంత సేపటికి అతడు గ్రహించి మరల దైవముపై మనస్సు లగ్నముచేయును. మరల కొంత సేపటికి ఎప్పటివలె మనస్సు జారిపోవుచుండును దైవముపై లగ్నము చేయబడినప్పుడు మనస్సు దైవమునందు జన్మించుచున్నది. పూర్వవాసనలోనికి జారిపోయినప్పుడు దైవమునుండి మరణము ననుభవించుచున్నది ఈవిధముగ మనస్సు జననమునుండి మరణమునకు మరల మరల సంసరణము చెందుచుండును అనగా జారిపోవుచుండును. ఇట్లు జారిపోవుటవలననే దురిత మనుభవించుచున్నది. కనుకనే జనన మరణములు సంసారదురితము అని చెప్పబడెను ఇచ్చట నొక యనుమానము వచ్చుట కవకాశ మున్నది దైవమునుండి జారిపోవుచున్నది గనుక మరణము దురితమే! కాని జననము కూడ దురితముగనే చెప్పబడినది అది యెట్లు సాధ్యము? దైవమునందు జన్మించుట దురిత మెట్లగును? ఇచ్చట కొంచెము సూక్ష్మముగ దృష్టిని ప్రసరింపచేయవలసి యున్నది దైవమునందు మనస్సు జన్మించిన దనగా అప్పటి వరకూ మరణము ననుభవించినది అని అర్థముగు చున్నది పూర్వము మరణము ననుభవింపనిచో ప్రస్తుతము జన్మించుట యెట్లు సాధ్యమగును? కనుకనే జనన మరణములు రెండునూ సంసారదురితములే! ఈ జనన మరణముల నిజస్వరూపము సనత్సుజాతీయమున చక్కగా నుదాహరణపూర్వకముగా వివరింపబడినది దైవప్రజ్ఞ నుండి మనస్సు పరాకు పడుటయే మృత్యువనియు మరల దైవప్రజ్ఞయెడల మనస్సు మేల్కొనుటయే జనన మనియు ధృతరాష్ట్రునితో 'సనత్సుజాతుడు' చక్కగా వివరించి చెప్పినాడు. ప్రస్తుత సందర్భమున హరిహరనాథుడు ఈ జనన మరణములనుండి అతీతముగ నుండగలుగుటకు అనుసరింపవలసిన మార్గమును కనగలిగిన వెలుగును ఇచ్చితిని అనినాడు ఇచ్చట వెలుగనగా వివేకము. నిత్యానిత్య వస్తు వివేకము. ఇట్టి వివేకము పొందినవాడు తామరాకుపై నీటిబొట్టువలె ముక్తిజీవనము ననుభవింపగలడు ఒక్కసారి దైవము నుండి ఈ వెలుగును పొందినవాడు మరల సంసారమున పడడు సంసరణ మనిన జారుట యని అర్థము. సంసారమున పడడనగా ముక్తస్థితినుండి జారడని యర్థము. అట్టి స్థితిని అనుగ్రహించినాడు తిక్కనకు హరిహరనాథుడు కనుకనే అతడు భారత భారతీ సముద్రమును దటియింప నీదగలిగినాడు.

వ్యాసహృదయము తెనుగున ఆవిష్కరింపబడవలెనన్నచో అందించువ్యక్తి వ్యాసుని వంటి స్థితి పొందితీరవలయును తిక్కయజ్వ భగవానుని అట్టి స్థితిని

# స్వర్ణాయతనము

- శ్రీ తంగుడిగె శ్రీధరరావు

అదిగో నానూత్న గేహ
మది తేజః పుంజమయము
అద్ది యమృత కిరణాస్పద
మతులిత సౌభాగ్య భరము.

ఆశావృత్తి ప్రకరము
లహంకార మమకారము
లశ్రువులను వడబోసెడు
ఆనవాలు లేవచ్చట.

అట మరణమ్ము పరిచిత
మ్మన వేద్యము తన్మహత్తు
అనవద్యపు టపు రూపము
లట నెయ్యెడ కనుపట్టును.



( 2 వ పేజీ తరువాయి )

అందుకొరకే కోరినాడు. అతని పవిత్ర సంకల్పమునకు సంతసించి బ్రహ్మానంద స్థితి ననుగ్రహించి తిక్కనను 'కవి బ్రహ్మ'గ చేసినాడు హరిహరనాథుడు.

*(డాక్టరు చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పర్యవేక్షణలో తిక్కన భారతము- ధర్మాద్వైతస్థితి అనునంశముపై నే చేయుచున్న పరిశోధనకు సంబంధించిన దీ వ్యాసము. వారికి నా కృతజ్ఞతలు.)

తాత్త్విక నవల-1.

# అసమర్థుని జీవయాత్ర - హేతువాద నిరాసము

- డా॥ ఉప్పలపాటి శ్రీరామమూర్తి

(గత సంచిక తరువాయి)

రామయ్యతాత సీతారామారావుకు అప్పుడు జ్ఞానబోధ చేస్తాడు 'జ్ఞానం కావలసిందే మానవుడు ప్రకృతిలో భాగమే అవటంవల్ల జ్ఞానమే లేక ప్రకృతికి దాసుడుగానే వుండేవాడు. ప్రకృతినించి వేరు చేసింది జ్ఞానమే. జ్ఞానంఒకటే మానవుని అభివృద్ధికి సహాయపడదు. దాన్ని సంఘ శ్రేయస్సుకి ఉపయోగపడేటట్టు చేసే మనస్తత్వం కూడావుండాలి' సీతారామారావుకి జ్ఞానం కొద్దోగొప్పోవున్నా జీవితపు లోతులు అనుభవంలోకి రాక, జ్ఞానానికి తగ్గ మనస్తత్వం ఏర్పడనందున, అతడు ఇన్నాళ్ళూ జీవితంలో తృప్తినీ, ఆనందాన్నీ పొందలేకపోయాడని రామయ్యతాత సీతారామారావుతో చెప్తాడు. జ్ఞానానికి తగ్గ మనస్తత్వం అతనిలో లేనందువల్లనే అతడి జీవితంలో సంఘర్షణ, దారుణమయిన పతనం సంభవించాయి జీవితం అంటే భయంపుట్టి పారిపోయేస్థితికి అతడొచ్చాడు. ఎందుకు అనేప్రశ్న మానవునిచే మంచిపనులు చేయించడానికే పుట్టింది. కాని అతడి ఆలోచనలను వెర్రితలలు వేయించడానికి కాదు. మానవునికి మంచిపనులు చేయడమే స్వభావం అయినప్పుడు ఈ ఎందుకు యొక్క అవసరం క్షీణిస్తుంది. అత్యాత దాని అవసరం పూర్తిగా లేకుండాపోతుంది. ప్రకృతిశక్తుల్ని అర్థం చేసికుంటే ప్రకృతికీ మానవునికీ సంఘర్షణ వుండదు. సాంఘిక పరిణామం మానవుని మనస్తత్వానికి ఆనందాన్ని ఇస్తుంది. దాంతో ప్రకృతితో మానవునికి సామరస్యం ఏర్పడి అతడిలోని విరుద్ధ శక్తులు నశిస్తాయి. ఆస్థితిలో మానవుడు పరిపూర్ణత్వాన్ని సాధిస్తాడు.

రామయ్యతాత ఈవిధంగా బోధచేసి, ఈదృష్టితో ప్రపంచాన్ని చూడమని సీతారామారావును హెచ్చరిస్తాడు. సాంఘిక పరిణామాన్ని ఆకళింపు చేసుకొని సంఘాన్ని ముక్కలు ముక్కలుగా చూడక ఒకటిగా చూడటం సీతారామారావును నేర్చుకొమ్మంటాడు. జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొని తాను సుఖపడి తన కుటుంబాన్ని సుఖపెట్టుకొమ్మని రామయ్యతాత అతడికి సలహా ఇస్తాడు.

గత జీవితస్ఫురణలు మనస్సునకు వచ్చి సీతారామారావు కన్నీరు కారుస్తాడు. ఇతడు మూర్తీభవించిన నిశ్శబ్దం అయినాడు. అర్ధచంద్రాకారపు వంతెన సారంగాన్ని చూచి ఉన్నట్టుండి మిథ్య మిథ్య అని అరుస్తూ స్మశానంవైపు నడుస్తాడు రావు. చీకటిపడుతుంది. స్మశానంలో అడుగు పెట్టడంతో అతడిలోని ఆవేదనా, ఆరాటం తగ్గాయి ఆచీకటీ స్మశానం, దూరంగామండుతున్న చితీ, అతడికి మనశ్శాంతిని కల్గించాయి తానిన్నాళ్ళుగా ఎదురుచూచిందీ, వెతికిందీ ఈస్మశానమే అనుకొని దూరంగావున్న చితిని తదేకదృష్టితో చూస్తూ కూర్చున్నాడు. అంతలో కుష్ఠించిన శరీరంగల ఒక అరవయ్యేళ్ళ వృద్ధుడు అతనివద్దకువచ్చి తనుచేసింది తప్పా అనిఅడుగుతాడు 'ఏదితప్పో ఎవరు చెప్పగలరు ? ఎవళ్ళ మనస్సు వాళ్ళకే సాక్షి' అని సీతారామారావు అంటాడు. అప్పుడుడు సీతారామారావు కంటికి తండ్రిగా కనిపిస్తాడు.

సీతారామారావు ఆలోచనలు చెంరేగి ప్రపంచాన్ని కొత్తగా చూపుతున్నాయి. కోలాహలంగా వున్న ప్రపంచాన్ని ప్రశాంతంగావున్న స్మశానాన్ని పోల్చి చూసు

కుంటే అతడి మనసు స్తిమితపడింది తన స్వగృహానికి తను వచ్చినట్లయింది ఈ శ్మశానంలో హెచ్చుతగ్గులూ, కీచులాటలూ, మోసాలూ, కుట్రలూ ఏమీ లేవు ఇక్కడ కూలీవాళ్ళూ, షావుకార్లూ, నీతిపరులూ అవినీతిపరులూ అంతా ఒక్కటే

తండ్రి సమాధి దగ్గరకు సీతారామారావు వెళ్తాడు. సమాధిపైని జిల్లేడు మొక్కలు దట్టంగా పెరిగివుంటాయి. తండ్రిలో ఏదోలోపం వున్నట్లు అతడు గ్రహిస్తాడు. తాను ఆదర్శంగా వుంచుకున్న తన తండ్రి, అనేక ఘనకార్యాలు చేసిన తన తండ్రి, ప్రస్తుతం ఈ జిల్లేడు మొక్కలకు ఎరువుగావుండి వాటి పోషణకు ఆధారంగా వున్నాడు. ఎంత ప్రాణం లేకపోతే మటుకు ఇటువంటి పనికి పూనుకుంటాడా? తనతండ్రి ప్రవర్తనలో ఏదో లోపంలేనిది, చెడులేనిది అతడు జిల్లేడు మొక్కలకు ఎందుకు ఆధారభూతుడవుతాడు. ఆయనలో నుండి జిల్లేడుకుబదులు గులాబీ మొక్కలు పుట్టకూడదా అని తన్నుతాను నిందించుకొని తండ్రిని నిందిస్తాడు. తండ్రి హేతువాదదృష్టిని విమర్శించడమే సీతారామారావు లక్ష్యంగా పెట్టుకుంటాడు 'నీవంశం, నీసంప్రదాయాలే నన్నీస్థితికి తీసుకొచ్చినయి ఇది వరకు ఎన్నికష్టాలు వచ్చినా నిన్ను తృప్తిపరుస్తున్నాగదా. నీఆత్మకు శాంతికి చేకూరుస్తున్నానుగదా అని సంతోషించేవాణ్ణి నాస్థితికి కారణం నువ్వుకాదూ?'

సీతారామారావులో నుంచి నీడఒకటి లేచి పక్కకుపోయి నిలబడి తండ్రిని సమర్థిస్తుంది. మాట్లాడుతున్న తన నీడను చూచి సీతారామారావు నిర్విణ్ణుడైనాడు. ఆ నీడను తండ్రి మెచ్చుకుంటున్నట్లు, తనను నిందిస్తూనట్లు గ్రహిస్తాడు సీతారామారావు నీడ తన నిజమైన కొడుకనీ, తన హృదయాన్ని, ముక్కలు ముక్కలుగాచేసిన దుర్మార్గుడూ, పీడకలగా తయారైనవాడూ ఇతడే నని సీతారామారావును తండ్రిదూషిస్తాడు. తండ్రి అతణ్ణి పొమ్మని గద్దించి, అతని నీడను తీసికొని అదృశ్యం అవుతాడు. పక్కనున్న అమ్మ సమాధి సీతారామారావుని పలుకరిస్తుంది. 'బాబూ నీవు మారావు నాయనా!' అని తల్లి సంతోషంగా అంటున్నట్లు సీతారామారావు పూహిస్తాడు. తల్లిని సంతోషపెట్టేవిధంగా తాను మారినందుకు అతడు మురిసిపోతాడు తల్లిపాదాలపై బడి, తాను మారడం చాలా ఆలస్యంగా జరిగిపోయిందని విలపిస్తాడు కొంతసేపటికి స్మశానం చీకటిలో దట్టమై అతనికి నల్లగా కన్పించసాగింది నల్లకుక్క ఒకటి అతని కాలు నాకుతూంది అతడు కదలకుండా ఆకుక్కను చూస్తూ వెల్లకిలా పడుకున్నాడు చూస్తూండగానే ఆ కుక్క ఆకారం తనఆకారంగా కన్పించసాగింది.

సీతారామారావు ఎదుట అతని ఆకారం నిలబడింది అస్తిపంజరం లాగ కన్పిస్తూన్న అతని ఆకారం తగ్గుతూ నుంచోలేక కూలబడింది. తన ఆకారం భావిజీవితాన్ని అతినికృష్టంగా ఊహించుకుంటాడు సీతారామారావు. తన ఆకారాన్ని కుటుంబసభ్యులు ఏ విధంగా తిరస్కరిస్తూన్నదీ చూస్తాడు తన భార్యా-బిడ్డలు మాపేనిర్లక్ష్యాన్ని విసుగుదలను సహించలేని ఆకారం సీతారామారావును చురాచురా చూస్తుంది 'చూశావా, నువ్వు చేసిన పని? నాభార్యకూ పిల్లలకూ కాకుండాచేశావు. ఆ పనివాడిని నాకివ్వరు, ఎందుకో తెలుసా? నేను చెడగొడతా ననీ పనికి మాలిన మాటలన్నీ చెప్పి చిన్నతనంలోనే వాడి మనస్సు పాడుచేస్తా ననీ వాళ్ళభయం పరమునంగాలుడా! బతుకుతున్నావా? ఎందుకు బతుకుతున్నావు? ఇంకా ఎవర్ని నాశనం చెయ్యడానికి? ఎవ్వరి జీవితాలు హాతమార్చడానికి' అని ఆకారం మంచం మీదనుంచి హఠాత్తుగా తన మీదకు రివ్వునదూకినట్లు సీతారామారావు ఊహిస్తాడు. ఆ ఆకారం విషం కక్కుతూ జ్యోతుల్లా మండుతున్న కళ్ళతోటి తనను నరకయాతన పెట్టబోతున్నట్లు సీతారామారావు అనుకుని, తనను రక్షించడానికి భార్యగాని కొడుకుగాని రాకపోవడంతో నిస్సహాయుడై నిలబడివుంటాడు. తనమీది జాలి, సానుభూతి, సహాయం, చూపించి అందించేవాళ్ళు లేకపోయినందుకు అతనెంతో విచారిస్తాడు.

తన్ను తానే రక్షించుకోవాలనుకొని, తన ఆకారాన్ని జయించడానికి పూనుకుంటాడు ఆకారాన్ని జయించి తన్ను తాను రక్షించుకోగలను అనేనమ్మకం సీతారామారావుకు ఏర్పడుతుంది. ఆ నమ్మకంతో ఆకారానిపై యుద్ధానికి తలపడతాడు కాని ఈ లోపలే అతని ఆకారం అతనిమీదకు దూకి ఎముకల్లాంటి కాళ్ళతో డొక్కల్లో తన్నుతుంది గుప్పిళ్ళు బిగబట్టి అతని మొహంమీద గుద్దుతుంది. గోళ్ళతో రక్కుతుంది రక్తం, కండలూ, ఎముకలూ బయటికి వస్తాయి. సీతారామారావు ఒక్కసారి పళ్ళు బిగించి, వంట్లో వున్న శక్తినంతనూకూడ దీసుకొని, అమాంతంగా ఆకారంమీద పడ్డాడు రెండుచేతుల్తో ఆకారం గొంతు పట్టుకొని నొక్కుతూ గట్టిగా పిసికివేస్తాడు. తనఆకారం మెడ నలిమేసి కళ్ళను పెరికివేసి ఆకారం నామరూపాలు లేకుండా చేస్తాడు సీతారామారావు ఆకారాన్ని జయిస్తాడు ఆకారాన్ని జయించడంతో తన్నుతాను జయించుకోవడమే అయింది సీతారామారావు తన్ను తాను జయించుకోవడం తన్ను తాను హత్యచేసుకోవడమే! తనఆకారం గొంతుకు నులిమి చంపడమే త. గొంతును తానే నులిమి చంపుకోవడం ఈవిధంగా అసమర్థుని జీవయాత్ర అతివిషాదంగా ముగుస్తుంది.

(తరువాయి 9 వ పేజీలో)

# సాహిత్యంలో హేమంతం

(గత సంచిక తరువాయి) — శ్రీ కరెవరపు వేంకట్రామయ్య, ఎం. ఏ.

ఇఁక కవితాసనాథుఁడు శ్రీనాథుఁడు 'శివరాత్రిమాహాత్మ్యము'న (4-18 to 30) హేమంతపు రాకను మసృణమనోజ్ఞముగ చిత్రించినాఁడు.

'హేమంతము శరదాగమ
సామంతము తుహినకణవిసంస్థుల శబరీ
సీమంతము మదనబల
శ్రీమంతము డాసె భువనసీమంతంబై' (4-22)

హేమంతము 'మదనబలశ్రీమంత' మనుట శ్రీనాథునకే చెల్లు. అచ్చసీతు ప్రవేశించు పెచ్చుపెరిగి, మార్గశిరపౌష మాసాలమధ్య వేళ' (4-29)నని అచ్చపు చలికాలమును సూచించినాడు. ఆచలి తీవ్రతను నిరూపించినాఁడు కూడ,

'కలవింక కలకలాకుల
వలభీగర్భములు సౌధవాటములు పురం
బుల యందుఁ దుహిన వేళలఁ
జలి గులగులఁ గూయునట్టిచందం
బొందెన్.' (4-25)

సౌధములకే అంతటి చలియున్న మఱి మానవుల సంగతి ఊహ్యమే. ఆచలినుండి ప్రేయసీ ప్రియు లెట్లు విముక్తులగుదురో శ్రీనాథుఁడు సరసముగ రూపుకట్టించినాఁడు.

'బింబోష్ఠీకుచకుంభభారములురః
పీఠంబులన్ హత్తి మో
దంబారన్మృదు కేళి శయ్యల శుభాం
తర్గర్భ గేహంబులం
దాంబూలీ దళపూగ పూరితముఖుల్
ధన్యాత్మకుల్ కృతకా
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్
సంభోగ లీలావధిన్' (4-27)

వారిని 'ధన్యాత్మకు' లని మెచ్చుకొనుట శ్రీనాథుని రసలోలుపతకు నిదర్శనము. హేమంతమును వర్ణించు పట్లను నైసర్గికమగు తన ఆంధ్రాభిమానమును విడువలేదు శ్రీనాథుఁడు. గ్రామసీమలలో చలికాలమున ఆంధ్రప్రజల జీవితమునకు అద్దము పట్టినాఁడు శ్రీనాథుఁడు.

'ఇండ్ల మొదలను నీరెండ నీరికలను
ననుఁగుదమ్ముఁడు నన్నయు నాటలాడు
నత్తయును గోడలును గుమ్ములాడుఁ
గుమ్ము
గాఁచుచోటికి మకర సంక్రాన్తి వేళ' (4-31)

శ్రీనాథుని సూక్ష్మేక్షికతకు నిదర్శన మీ పద్యము. కాగా వినుకొండ వల్లభరాయ (శ్రీనాథ ?) కృతముగ ప్రసిద్ధమగు క్రీడాభిరామము'న హేమంతము రసరమ్యముగ వర్ణితము. శీతోపద్రవము చూడుఁడు.

'ప్రక్కలు వంచివంచి, ముని
బండ్లను పండ్లను రాచిరాచి, ఱొ
మ్మక్కులఁ జేసి చేసి, తల
యల్లనఁ గాళుల సంది సంది, లో
చక్కికి నొక్కినొక్కి యిరు
చంబడ, గుమ్మడి మూటగట్టి, వీ
పెక్కి దువాళి చేసి, చలి
యిక్కడ నక్కడఁ బెట్టు వేఁడుకన్'. (క్రీ. రా. 45)

ఆమ్రేడిత శబ్దములచే చలితీవ్రతను ఆమ్రేడించినాఁడు కవి. 'స్థూల ద్వి త్రి పటావకుంఠనములు, ధూపోపచారంబులు, గాలాగుర్వనులేపనంబులు, వధూగాఢోపగూహంబులు, గేళీగర్భనికేతనములు లేనిచో ప్రాలేయాగము భరించుట కష్టమట. (క్రీ.48) 'భయభ్రాంతంబులై యూష్మముల్ వాలాయంబుగఁ బ్రాఁకె నంధ్రవనితావక్షోజ శైలాగ్రముల్'(47) అంటాడు. ఆ శీత కాలమున 'గ్రొత్తయోరంబు నిగురావకూరతోడఁ బిచ్చిలంబైన నేతితోఁ, బెరుగుతోడ' బల్లెటూరి ప్రజలు సౌష్ఠవముగ భుజింతు రట. (56) ఇట్లే గాథాసప్తశతి యందలి గాథ యొకటి చక్కగా క్రీడాభిరామమున నాంధ్రీకరింపఁబడినది.

'మాఘమాసంబు పులివలెమలయుచుండఁ
బచ్చడం బమ్ము కొన్నాఁడు పణములకును
ముదిత చన్నులు పొగలేని ముర్మురములు
చలికి నోఱగోయ కేలుండు నైరికుండు ?' (క్రీ. రా. 262)

కాగా 'షట్చక్రవర్తి చరిత్రము'న మల్లారెడ్డి హేమంతము 'కుటిలభూపతి వలె కువలయ కమలాభివృద్ధి దుర్వ్యాపార విధినణంచి, ఆతతాయి అతులిత దోషాతిశయము లోక మెఱుంగ సంతరించి, కాక్రోదరునివలె ఘనకంచుకంబుల లలి నచ్చటచ్చట వెలయునించి, పానీయశాలలు పాడుచేసి, తాళవృంతముల పాఱవేసి ఉల్లములు తల్లడిల్లంగ నుల్లసద్దినాంతికంబుగ' ప్రవేశించినట్లు కల్పించినాఁడు.

'పద్మపురాణము' లో మడికిసింగన హేమంతతుషారమును రమ్యముగ వర్షించినాడు (1-76).

'నేలయంతంతయు నెఱిఁజంద్రకాంతపు
టాలఁ గట్టించిన లీల మెఱసె.
నింగియంతంతయుఁ బొంగి దుగ్ధాంభోధి
నిట్టదొట్టిన మాడ్కి దట్టమయ్యె,
సకలజీవులమీఁద బ్రకటమై హారికీర్తి
కలయఁ బర్వినమాడ్కిఁ దెలుపు చూపె,
నక్కజంబుగ నెల్లదిక్కులు నొక్కటఁ
దెరచీర లెత్తిన కరణిఁదోఁచె
నగము లెల్లను నీహార నగములయ్యెఁ
దరువు లెల్లను ఘనసార తరువులయ్యెఁ
బక్షులెల్లను రాయంచ పదవులయ్యె
గురుతరం బగు పెనుమంచు కురియుకతన'

'చిత్రభారతము'న (2-29 to 35) చరిగొండ ధర్మన్న హేమంతాగమముతో జలదము మంపు దప్పి కర్దమమింకినట్లు వర్ణించినాఁడు, ఎల్లరోగములు వెల్లివిరియును గాన వెజ్జులకు సీతురాక సంతోషదాయకమైన దట. కాకమాను భైరవకవి 'శ్రీరంగమాహాత్మ్యము'న (2-31 to 35) హేమంతమహిమ ఇట్లు వర్ణితము.

'హిమముచే నంబరంబెల్ల నిమురుగొనఁగ
నుష్ణకరుఁడునుగరములొయ్యొయ్య సాఁచి
తాను ననలాశ ధరియింపఁబూనె ననఁగ
నెంతయునవచ్చు నింక హేమంతమహిమ'

ఇఁక పోతనామాత్యుఁడు భాగవతము దశమస్కంధమున హేమంతమును చమత్కారచారువుగ వర్ణించెను.

(దశ. స్కం. 796 to 802)

'శంఖుకంట నొకటి జలరాశి నొక్కటి
మఱియు నొకటి మనుజ మందిరముల
నొదిఁగెఁగాక మెఱసియున్న మూఁడగ్నులు
చలికి నోడి భక్తి సలుపకున్నె'

త్రేతాగ్నులే చలికి వెఱచి దాగె నన మానవమాత్రులెంతటివారు చలిని గెలువ?

పొదుపుఁగొండ మీఁదఁ బొడుచుట
మొదలుగాఁ
బరువువెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మఱుఁగుఁజొచ్చెఁగాక మసలినఁ జలిచేతఁ
జిక్కఁజిక్కననఁగఁ జిక్కకున్నె'

హేమంతమునందు పగళ్లు కుఱచలగు విషయమునకు కారణము చమత్కారముగ సూచితము.

శ్రీకృష్ణదేవరాయలు 'ఆముక్తమాల్యద' యందు 'సీతునందచెలువ ల్పెదవుల్దడుపంగ' ననినాఁడు. అంతేకాక హేమంతమున స్త్రీలు అధరాలకు మధూచ్ఛిష్టము పూసికొనెడి వారను విషయముసూచించినాఁడు. 'పారిజాతాపహరణము'న తిమ్మన నందనోద్యానవన వర్ణనమున హేమంతమును తడవినాఁడు'. తల చూపె నొకవంక దరదళత్సేవంతి, గాగంధినీహార కణభరములు'- కొంచెము విడిన చేమంతిపూలగంధము గల్గిన మంచు బొట్లొకచో కనబడినవట. (3-35)

ధూర్జటి 'కాళహస్తి మాహాత్మ్యము'న హేమంతమందలి సూర్యబింబమును రమణీయముగ వర్ణించినాఁడు.

'ఆ తరువాత జంతు నివ
హంబు వడంక నడంకు వేది యో
షాతతి ప్రాణవల్లభుల
సంతతమున్ పరిరంభణంబునన్
ప్రీతుల జేయ సూర్య్య శశి
బింబమటంచు చకోరదంపతుల్
భీతిదొరంగ వచ్చె నతి
భీకర శైత్యము శీతకాలమున్'

హేమంతమున మంచుకురియగా చకోర దంపతులు సూర్యుని చంద్రునిగ భావించినవట. సూర్యునిలో తీక్ష్ణత లేదని వ్యంగ్యము.

'రామాభ్యుదయము' అయ్యలరాజు రామభద్రుఁడు శృంగారరసప్రసన్నమగు కల్పన మొకటి చేసెను. (5-126)

'హిమసమయాక్రమభీతిన్
ద్యుమణినవోష్ణంబుకొంతయుని చెనో కాకు
న్న మహీస్థలి నెక్కడి దల
ప్రమదాకుచసీమ నుష్ణభావముదలఁపన్'.

'హిమమునకు భయపడి సూర్యుఁడు తన ఉష్ణమును కొంత ప్రమదాకుచసీమయం దుంచినాఁడట. అంతకుమించి భూమిలో ఉష్ణము మఱెచ్చటను లేదట' సహృదయ హృదయంగమ మీవర్ణనము.

'నవ్యకవిత్వకళాకలాపుఁ'డగు రామకృష్ణుఁడు తన 'పాండురంగమాహాత్మ్యము'న రాధ తపస్సును వర్ణించు తావున హేమంతమును నవ్యరీతిని వర్ణించినాఁడు.

(4-7)

'నవ్యకాలాగరూద్వర్తనముల సతుల
చన్నుగొండల నూష్మాగ్ని సంభవించె
మతి సమగ్రలు ధూమానుమానకలన
నగ్నిసాధింతురచలంబులందునెపుడు.'

'పర్వతముపై వ్యాపించియున్న పొగను చూచి తార్కికులు ఆ పర్వతముపై అగ్నియున్నదని నిశ్చయింతురు. ఆ సిద్ధాంతము రాధ విషయమున రూపకమూలమున సిద్ధింపఁజేయఁబడినది. ఇచట కాలాగురువు ధూమముగను, ఆమె స్తనములు కొండలుగను, వేఁడిమి అగ్నిగను నిరూపింపఁబడినవి'. అందుకే రామకృష్ణుఁడు సరసార్థబోధ ఘటనాహేలా పరిష్కారుఁడు.

పింగళిసూరన 'కళాపూర్ణోదయము'నందు హేమంతమును వర్ణించెను (7-177,178) కాని వైచిత్రిలేదు. అట్లే సంకుసాల నృసింహకవి 'కవికర్ణరసాయనము' న (6-26 to 30) హేమంతము వర్ణితము. మాంధాత తపస్సమయమున 'జగమెల్ల ముంచిన బలువగు నమ్మంచులో వెలుగుల ఱేడు వలపుదెరలోన దర్పణముకు బోలినాఁడు.' 'పంచతంత్రము'న బైచరాజు వేంకటనాథుఁడు శీతకాలమందలి కృషీవలుల జీవితమును సహజసుందరముగ వర్ణించినాఁడు. (1-676 to 688). ఆరెకుకుడు, పుచ్చకరుగు, ఆవువెన్న, దోసగింజలు, తనిమజ్జిగ, దండారగ బట్టి రెడ్డి మడిమాలం ములుగోలల బూని యెడ్లపై కోలేరుల వైచి దున్నుటకు పోవుచుండురట (1-687) కనుపర్తి అబ్బయామాత్యుఁడు. 'కవిరాజమనోరంజనము' అనిరుద్ధ చరిత్రము) నందు (4-135 to 139) 'నవయౌవన సీమంతవతీ కుచాద్రి సీమాంతర విశ్రామ సుఖమున నిరాకృతి సామంతమై హేమంతము తనరినది'. మరియు

'చలికి బెగడొంది మేరువుచాటు జొచ్చి
యెట్టకేలకు గాని రాఁ డినుడు వెడలి
వెడలి పరువెత్తి యపరాద్రి వెనుక నేగు
నితర జనముల శీతార్తి యెన్న నేల'

చలికాలమున సూర్యోదయము ఆలస్యముగానగుటకు,పగటికాలము తక్కువగానుండుటకు కారణము చమత్కారముగ కల్పింపఁబడినది.

'హంస వింశతి' యందు (3-170 to 172) అయ్యలరాజు నారాయణామాత్యుఁడు 'హేమంతము దుర్దాంతమై' ప్రవేశించినట్లు వర్ణించినాఁడు. అందలి హిమవారిబారి యిట్లున్నదట.

'శాంతము లయ్యె నెండలు, ని
శాంతములయ్యె వనూపచంబు ల
త్యంతమువాడి వేఁడిమికిఁ
దాంతములయ్యెఁ బయోజముల్, ప్రశా
క్రాంతము లయ్యె వాతెఱలు,
క్రాంతములయ్యె మహోష్ణవస్తు, లా
శాంతము లయ్యెఁ దావులు ని
శాంతములన్ హిమవారి బారికిన్

(3-172)

కంకంటి పాపరాజు 'ఉత్తర రామాయణము'లో (5-279to288) హేమంతమున మంచు ప్రవేశింప నిశ లాయత గతి వహించినవి. అంతే కాదు, అతడు శిశిర మహిమను మనోజ్ఞముగ రూపుకట్టించినాడు. ప్రజాజీవితమునకు అద్దము పట్టినాడు.

'దినము ప్రాతస్స్నాన మొనరించుద్విజులకు
నగు కర్మలోప భయంబు కంటె,
ప్రాచి పనుల్ సేయ లేచు కోడండ్ర కా
నత్తలవలని భయంబు కంటె,
గడువులో దూరమేగగ నున్న చరులకు
నధిపుచే నొదవు భయంబుకంటె,
గ్షణం బొనరింపఁ గడఁగు కాపుల కార
యమిఁబైరు చెడుననన్ భయంబుకంటెఁ
గడిది యయ్యె సీతు ఖగ మృగ పశు నర
ప్రముఖ జంతువులకు భావములను
జాల మించె మిథున సంపర్క సౌఖ్యంబు
శిశిర మహిమ వినుతి సేయవశమె'

(15-182)

హేమంత ఋతుసహజములగు ప్రకృతి లక్షణములు పంటలు కూడ పాపరాజు వర్ణించునాడు. ఇట్లు వర్ణించిన ప్రాచీన కవులు అరుదు.

'కాచె నుసిటికలు తఱచుగఁ
బూచెం జేమంతివిరులు భూమికి బరువై
తోఁచెఁ జణకాది సస్యము
లే చెన్ బలుమంచు చదల హేమంతమునన్'

కాగా ప్రాతర్వేళల గురియుమంచు లేఁ బచ్చికల మీద బడి మిగుల దెల్లనై ప్రకాశించుచున్నదట. అది మిగిలిన సర్వభూతములు వడంకఁదానచలయై చెల్వొందు భూదేవికిన్ శీతర్తుప్రభుఁ డిచ్చు వజ్రముల రాశిం బోలి' యున్న దట నల్వొంకల.

ఏవం విధముగ ప్రాచీన సాహిత్యమున హేమంత ఋతువు వస్త్వాశ్రయ రీతిని వర్ణింపఁబడినది.

(సశేషం.)



# రష్యా ప్రజాకవి మైకోవ్‌స్కీ

( గతసంచిక తరువాయి ) - శ్రీ ఇ. టి. లోకనాథరావు

రష్యాలో మొట్టమొదటిసారిగ లెనిన్‌కు కవితను అంకితం చేసినకీర్తి మైకోవ్‌కు దక్కింది. 1923 మార్చిలో కామ్రేడు లెనిన్ అస్వస్థుడుగా ఉన్నాడని ప్రభుత్వ బులెటన్‌లో కనబడగానే మైకో ఆందోళన చెందుతూ 'We don't belive' అనే చిన్న ఖండిక రచించాడు అది ఒక భయానక రాగాలతో కూడిన విషాదాంత రచన. 1924 లో కామ్రేడ్ లెనిన్ మరణవార్త వినగానే మైకో నిశ్చేష్టుడై 'వ్లడమీర్ ఇల్యిచ్ లెనిన్' అనే సుదీర్ఘ రచనతో మళ్ళీ తేరుకున్నాడు. అన్ని రచనలలోకి లెనిన్‌పై వ్రాసిందే చాలా గొప్ప దని మైకో చెప్పుకున్నాడు.

Never have I wanted to be understood so much as in this poem, This perhaps is the most important of work I have Over done'.

లెనిన్‌పై వేలకొద్ది రచనలు చేసారు. చేస్తున్నారు. కాని 'మైకో' రచనే అగ్రభాగంలో నిలవడానికి కారణం అతని మేధాసంపత్తి, ఆలోచనా విధానంతో పాటు, అతడు విప్లవంలో పాల్గొన్నాడు; లెనిన్‌తో మాట్లాడాడు. అతని ప్రసంగాలు ఎన్నోసార్లు విన్నాడు. అతని మరణంపట్ల అశేష ప్రజానీకం పొందిన దుఃఖాన్ని అవగతం చేసుకున్నాడు. గనుకనే అంతగొప్పగా, అతనిపై రచన చేయగలిగాడు. లెనిన్ను ఉద్దేశిస్తూ we are burying the earthliest of beings, of all that ever walked this earth of ours! భూమండలంలో 'విప్లవం' తెచ్చిన మొదటి వ్యక్తి అని మనకి వెల్లడిచేశాడు. 'మైకో' లెనిన్ పై రాసిన గేయాన్ని బహిరంగ సభలలో, ఫ్యాక్టరీ క్లబ్బుల్లో, విద్వత్ పత్రుల్లో వల్లెవేస్తూ సాహితీ శత్రువులు తనపై తెచ్చిపెట్టిన అపకీర్తినుండి కాసి తప్పించుకొని 'నైతికబలాన్ని' ప్రజలనుండి పొందగల్గాడు ఈ గేయం సాహితీ ప్రియులలోనే కాకుండా, ప్రజలందర్లో ఒక జీతపు పాటగా మారడం మైకో గొప్పతనానికి గీటురాయి. ఒక మహాకవి గొప్పతనాన్ని, మరొక మహాకవే చక్కగా అర్థంచేసుకో గలడనే నిజాన్ని 'శ్రీశ్రీ' తెనుగులోనికి ఈ సుదీర్ఘ గేయాన్ని అనువాదం చేసి చూపించాడు.

'లెనిన్' పై రచనతో ఎన్నెన్నో కలలు కంటున్న విదేశపర్యటన సఫలమయింది. పోలెండు, జకోస్లేవియా జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా దేశాలు పర్యటించాడు. తన దేశంలో జరిగిన మార్పులను గూర్చి, తన సాహితీ పటిమను గూర్చి అనేక సాహితీ విమర్శకులతో చర్చలు చేసాడు. విదేశీయ పర్యటన ఫలంగా 'American cycle 'About paris' అనే రచనలుకూడ చేయడం జరిగింది. అంబర చుంబిత సౌధలతో నిండిన న్యూయార్క్ నగరాన్ని చూసి ఎంతగా ముగ్ధుడయ్యాడో, పెత్తందార్లు చేసే దోపిడీ విధానం, వలసవిధానాలు చూసి అంతగా క్రుంగిపోయాడు. అందుకే 'American Cycle అనే సంపుటిలో నుండి ఒక విషాదాంత గేయాన్ని 'ఆకలితో మాడుచున్న తన కుటుంబం గూర్చి మానం అమ్ముకున్న నీగ్రోవనితలకు అంకితం చేసాడు'. అమెరికా గూర్చి రాసిన గేయాల్లో 'Atlantic Ocean' అనే గేయం గొప్పదై రమ్యత కలది. 'A Dearer and dearer, you are to m heart in breadth, in blooc

n cause, in spirit, my revolutions elder brother' అని సంబోధించాడు. 'కొలంబస్ చెమటను గ్రోలిన రాక్షసివని ఈసడించాడు.

'మైకో' రష్యాలో గల వామ పక్ష కళాకారుల సంఘానికి నాయకుడుగా మెలిగాడు. సామూహికంగా ఒక ఆశయంకోసం, ఒక లక్ష్యంకోసం కళాకారులంతా పని చేయాలని అతడునొక్కి చెప్పాడు. ఈ వామపక్ష కళాకారుల సంఘములోగల 'ఈస్థటిక్' ప్రభావం మైకో రచనలలో కూడా చోటు చేసుకొంది. కాని వానినుండి తప్పించుకొని మైకో తనదైన కయితగూడు కట్టుకొన్నాడు.

మైకో మొత్తం రచనల్ని చూస్తే అనేక సందర్భాల్లో తనకుతాను చిత్రించుకొన్న రచనలే ఎక్కువ దొరుకుతాయి. మైకో ఆఖరి రచన 'Aloud and traight' అనే సుదీర్ఘ గేయం అసంపూర్తిగానే మిగిలింది. ఇందులో మైకో వివిధ కార్మిక, కర్షకులతో తనకు గల అనుభవాలను, వారి పరిస్థితులను చిత్రించాడు. అట్టడుగు ప్రజల గుండె లోతుల్లోనుండి తీసిన భావాల్ని కవితావిహారం చేయించాడు. ఇది కూడా తన స్వీయ చరిత్రను సంబంధించిందే. అందుకు కారణం విప్లవ కవిగా తనకు వివిధ వర్గాలలో విప్లవాలతో గల సంబంధాన్ని, అనుభూతుల్ని ప్రతిబింబించే రచనలు కావడం. అందుకే అతడు అన్నట్లు 'I ny self will speak of me nd my time' కవి+తన చుట్టూ ఉన్న సంఘం = కవిత్వం మైకోది. ప్రజా సమస్యలన్ని ప్రతిబింబిస్తూ కవిత్వం రాయడం ఒక గొప్ప వీరకృత్యం. ఆ పనిలో కవి తన సొంత లాభాన్ని, పేరును, సుఖాన్ని వదులుకోవడం ఎంతో గొప్ప. ఈ రెండూ మైకోపట్ల ప్రత్యక్షరసత్యాలు. We are comrads all, so let us, share our glory' అని మైకో సంతోషంగా చెప్పాడు.

'మైకో' భావాన్ని వెల్లడి చేయడంలో దిట్ట. భావోద్రిక్తతను ప్రదర్శించేటప్పుడు Hyperbole· ఛాతికమైన Metaphers ను వాడుతాడు అక్టోబరు విప్లవాన్ని రగిల్చేటప్పుడు, అక్టోబరు విప్లవం విజయవంతమై సమసమాజ స్థాపన జరిగేటప్పుడు ఈ రెండు సమయాల్లో మైకో సాహితీవీరుడై, నేతయై ముందడుగు వేశాడు. రష్యా జాతీయతన, సంస్కృతిని దృష్టిలో పెట్టుకొనే రచనా ప్రక్రియలను మలచాడు. కవే కాదు గొప్ప వక్తగూడ. విప్లవదినాలలో ఈతని వాగ్ధోరణి చైతన్య సంపుటాలను వెదజల్లింది.

'మైకో' సాహితీసమరం అవధులు లేనిది. అదొక ప్రపంచ పర్యటన. కవిత్వంలో అతడు వేసిన ఎర్రటి బాట తరువాత వారికి ఎన్నో, ఎన్నెన్నో గమ్యాల్ని చూపింది. కవికి, కడలకి ఎల్లలు ఉండవు కనుకనే మైకో కవిత్వం అమెరికా, జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లండు దేశాలలో అనువాద రూపాలలో వెల్లివిరుస్తున్నది.

'మైకోవిస్కీ' మాటలసత్తువ, మాటల మెత్తదనం, మాటలకోపం అనే మూడు లక్షణాలు ప్రపంచ కవిత్వంలో చోటు చేసుకున్నాయి. ఊహాభావాల్ని వదలి, ప్రజలందర్నీ సమసమాజం వైపు నడిపించే విప్లవకర మార్గాల్ని వెయ్యమని ప్రగతి కవులకు విన్నపం చేసిపోయాడు. 'మైకో' ఒక మహత్తరశక్తి. కయిత కడలిలో బడబానలం. అంగుకే ఫ్రెంచి కవి 'Tean chabranth' ఇలా అన్నారు. 'He is still half a century ahead of all' మైకో విస్కీ కవిత్వం ఒక ప్రపంచగీతం. ఆ గీతంలో బాధలు, బరువులు, జయాలు, జీవితసమరాలు అన్నీ ఉంటాయి, ఆ మహాకవి తన కవిత్వం గూర్చి ఇలా చెప్పాడు.

'It is hardships, that really give taste to our life· This song, then· will be a song of our worries, trinmphs and everyday strife

ఇంతటి మహాకవికి దుర్మరణం తప్ప లేదు. 1930 April 14 న ఆయన తన గదిలో తానే తుపాకీ పేల్చుకొని మరణించాడు. తన వ్యక్తిగత భగ్నప్రేమ, సాహితీ శత్రువులు కల్పించిన ఏహ్యమైన వాతావరణం, ఇంకా అనేకం. . అతడే చెప్పుకొన్నట్లు, I am quits with life and no need to list mutual troubles, offences· hurts' మహాకవిని అంతం చేసాయి. తత్ఫలితంగా అతని గొప్ప తొలినాటకం 'Bath house' అసంపూర్ణంగా మిగిలిపోయింది.

---

(4 వ పేజీ తరువాయి)

రచయిత గోపీచంద్ హేతువాద వాతావరణంలో పుట్టిపెరిగి, ఆదృక్పథం జీవితానికి ఎంతవరకు అన్వయిస్తుందో అనుభవపూర్వకంగా తెలిసికొని, దానిలోని లోపాలను గ్రహించి, దానినుండి పరిణమించిన పురోగమన జీవితాన్ని, అన్వేషిస్తూ స్వానుభవసారాన్ని నింపి రచించిన నవల అసమర్థుని జీవయాత్ర. తండ్రి మరణానంతరం గోపీచంద్ పడిన ఆవేదనే సీతారామారావుపడినది. ఇలా సీతారామారావు జీవితం హేతువాద దృక్పథంతో ముడిపడివుంది.

హేతువాదానికీ 1 అసమర్థజీవితానికీ ప్రత్యక్షమయిన సంబంధంఅంటూ ఏమీ వుండదు. అయితే జీవితానికి హేతువాద దృక్పథం ప్రతిబంధకం కాకూడదు. అట్లా ప్రతిబంధకంగా తయారైనపుడు అసమర్థజీవితం తప్పదు. హేతువాద దృక్పథాన్ని సమన్వయదృష్టితో అన్వయించి చూచినప్పుడు అది సమర్థమయిన జీవితానికి దోహదకారి అవుతుంది. అయితే హేతువాదదృక్పథంతో అలవడిన జ్ఞానాన్ని సరైన మనస్తత్వంతో ఆకళింపు చేసుకోలేక, దాన్ని జీవితంతో సమన్వయం చేసుకోలేనప్పుడు జీవితం నరకప్రాయమే అవుతుంది. పరిణతి చెందని వ్యక్తి మనస్తత్వాన్ని హేతువాదం ఆశ్రయించినప్పుడు అది వెర్రితలలు వేసి ఆవ్యక్తిని నరకంలోకి కూలద్రోస్తుంది సీతారామారావు జీవితంలో అదే జరిగింది

---

1. హేతువాదం లేక బౌద్ధికవాదం : (Rationalism) గ్రీకు దార్శనికుడు పార్ మెనిడిస్ (క్రీ. పూ. 514) బుద్ధికిని ఇంద్రియ సంవేదనకు భేద మున్నదని చెప్పెను. ఇంద్రియములద్వారా బాహ్య ప్రపంచమునుండి వచ్చిన జ్ఞానము సత్య దూరమనియు, బుద్ధిద్వారా తెలిసికొనిన జ్ఞానము యథార్థమనియు చెప్పెను. ఆధునిక యుగమునందు బౌద్ధికవాదము లేక హేతువాదము : బుద్ధివలననే జ్ఞానము కలుగు ననియు, శబ్దప్రమాణ జన్య జ్ఞానము గాని, ఇంద్రియజ్ఞానము గాని యథార్థతను కలిగియుండవనియు బౌద్ధికవాదుల ముఖ్యసిద్ధాంతము. కాంట్ (Kant) జర్మను చింతకుడు : జ్ఞానోత్పత్తికి ఇంద్రి వ్యాపారము బుద్ధి విశ్లేషణములు కూడ అత్యవసరమనియు, ఈ రెండును పరస్పర సహకారులేగాని విరుద్ధములు గావనియు, హేతువాదమును సంస్కరించెను.( చూడు. విజ్ఞానసర్వస్వం 10 వ సంపుటం.)

"Rationalism is that system of Philosophical belief which asserts that human reason unaided its competent so attain objective truth. In its basic form it is an epistemological doctrine in which rea son is contrasted with sense-experience, which is held to be unneessary, or even a hindrave to the attainment of truth"

— Encyclopaedia Britannica.

(సశేషం)

# తెలుగు కవితకు జీవంపోసిన శేషేంద్ర

డా. తంగిరాల వెంకటసుబ్బారావు.

సాంప్రదాయిక కవిత్వంలోని భారతీయ సంస్కృతి, భావకవిత్వంలోని సౌందర్యాన్వేషణ, అభ్యుదయ కవిత్వంలోని సామాజిక చైతన్యం, వచనకవిత్వంలోని కరుణరసభరితమైన మానవతావాదం, దిగంబర కవిత్వంలోని ఆక్రోశం, విప్లవకవిత్వంలోని అగ్ని-సమపాళ్ళలో మేళవించి,జీవచ్ఛవంలా పడివున్న తెలుగు కవితాలోకంలో తన కమనీయ కవితామృతాన్ని కురిపిస్తున్న ఆధునిక కవిసత్తముడు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ-అనే త్రిమూర్తుల్ని తనలో కలుపుకొని, త్రివిక్రముడుగావిజృంభించినమహాకవి. శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ. విశ్వనాథవారి పాండిత్య గాంభీర్యం, కృష్ణశాస్త్రి తియ్యని పలుకుబడి, శ్రీ శ్రీ సామాజిక చైతన్యావేశం శేషేంద్రలో త్రివేణీసంగమం చెందాయి. అందుకే ఆయన 'యుగకవి' కాగలిగారు; 21వ శతాబ్దానికి ఉపస్తారగా వెలిగారు. శశాంక చెప్పినట్లు "శేషేంద్రశర్మ కవుల్లో కవి, పండితుల్లో పండితుడు. పశ్చిమాన టి. యస్. ఇలియట్ తోను, తూర్పున జగన్నాథ పండితరాయలతోను వీరిని పోల్చవచ్చును'.

శేషేంద్ర క్రీ. శ. 1927, అక్టోబరు 20 వ తేదీని జన్మించారు. స్వగ్రామం నెల్లూరు జిల్లా 'తోటపల్లిగూడూరు గ్రామం. గుంటూరు ఆంధ్రాక్రిస్టియన్ కాలేజీలో చదివి, భౌతికరసాయన శాస్త్రాలతో బి.ఏ. పట్టం పుచ్చుకున్నారు. తరువాత మద్రాసు లా కాలేజీలో న్యాయశాస్త్రం అభ్యసించారు. తండ్రిగారైన గుంటూరు సుబ్రహ్మణ్యం గారి దగ్గర సంస్కృతాంధ్రాలు క్షుణ్ణంగా చదువుకున్నారు. మునిసిపల్ కమీషనర్ గా ఆంధ్రదేశంలోని అన్ని పట్టణాల్లోనూ ఉద్యోకవితాభిమానిని రాజకుమారి ఇందిరాదేవి ధనరాజ్ గిర్ గారిని వివాహంచేసుకొన్నారు. వీరి వివాహం ఉర్దు తెలుగుల కవితల వివాహం. తద్వారా ఉర్దూకవితా మధురిమతో వీరికేర్పడిన సన్నిహిత అనుభవం తెలుగుకవితా రంగంలో వీరిస్థానాన్ని అద్వితీయం చేసింది. ఆమెతో కలిసి ప్రపంచ పర్యటనచేసి విశ్వకవితను పరించివచ్చారు. 1968లో మారిషస్ మడగాస్కర్, తూర్పుఆఫ్రికాదేశాలు సందర్శించారు.1970లో జర్మనీ,ఇంగ్లండు ఫ్రాన్సు, ఇటలీ, గ్రీసు మొదలైన ఐరోప

దేశాలు పర్యటించారు. ప్రతిభావ్యుత్పత్తులకు ఈ లోకజ్ఞానం మరింత బలాన్నిచ్చింది. తన ప్రతికావ్యాన్ని సహధర్మిణి సాయంతో ఆంధ్రాంగ్ల భాషల్లో ప్రకటించారు. ఇప్పటికి దగ్గర దగ్గర 30 కావ్యాలూ, గ్రంథాలూ వెలువడ్డాయి. 1951 లో పిఠాపురంనుంచి శ్రీ వేంకట పార్వతీశ్వరకవుల పీఠికతో 'స్వాహాబ్' అనే పద్యకావ్యం ప్రకటించారు. 1947-58 మధ్యకాలంలో ఆయాసన్ని వేశాలలో వారు ఆశువుగా అల్లిన హాస్య, వ్యంగ్య శృంగార చాటువు లన్నీ కలిపి 1961 లో 'చంపూవినోదిని'గా ముద్రించారు. 1963 లో ప్రాచీన ఛందస్సులో పేదలబాధల్ని వర్ణిస్తూ 'ఋతుఘోష' అనే పద్యకావ్యం వెలువరించారు. 1969 లో ప్రాచీన పద్య ఛ్ఛందస్సు, నవీన గేయఛందస్సు కలిపి 'పక్షులు' అనే కావ్యం రచించారు. సౌందర్యోపాసన తాత్త్వికచింతన, సామాజిక చైతన్యముల త్రివేణీ సంగమమైన 'శేషజ్యోత్స్న' 1972 లో ప్రచురిత మయింది. తెలుగువాళ్ళు మరిచిపోయిన మహాప్రస్థానాన్ని మళ్ళీ జ్ఞాపకంచేస్తూ, శ్రామికుడు నాయకుడుగా చిక్కని కవిత్వాన్ని పుక్కిస్తూ అఖండమైన మానవతావాదంతో ప్రజ్వలించే 'మండేసూర్యుడు' 1974 లో వెలువడింది. వర్తమానకాలంలో భారతదేశ ప్రజలు అనుభవిస్తున్న కడగండ్లలోంచీ, ప్రతినాగరికతకూ మూలభూతమైన కర్షకుని జీవితంలోంచీ, శేషేంద్రుని ఆత్మ్యోత్తమకృతి 'నాదేశం - నా ప్రజలు' 1975లో పుట్టింది. కవి అంతర్ముఖుడై ఆత్మవిచారం కావించుకొన్న 'నీరైపారిపోయింది' అనే కావ్యము 1976లోనూ బహిర్ముఖుడై విప్లవచైతన్యాన్ని ప్రబోధించే 'గొరిల్లా' అనే కావ్యము 1977లోనూ వెలువడ్డాయి. ఇటీవల వెలువడిన 'సముద్రం నాపేరు' అనే కావ్యము వీరి అంతర్-బహిర్ దృష్టుల సమ్మేళనఫలితం.

సంస్కృతాంధ్రాలను ఆపోశనం పట్టిన శేషేంద్ర, పాశ్చాత్యకావ్యప్రక్రియల్ని జీర్ణం చేసుకొన్నారు. ఫ్రెంచి మహాకవి 'బోదిలేర్' కవితలను తెలుగులోకి అనువదించారు 'కడవలు-కెరటాలు' అనే పేరుతో. అలాగే ప్రపంచంలోని వివిధ భాషల మహాకవుల ఉత్తమ కవితలను 'ప్రపంచ కవిత' అనే పేరుతో తెనిగించారు.

కవిత్వమే కాకుండా శేషేంద్ర 1958 లో 'మబ్బుల్లో దర్బారు' అనే విప్లవ నాటిక, 1968లో 'విహ్వాల' అనే కథల సంపుటి కూడా ప్రకటించారు.

శేషేంద్ర కేవలం కవీ, రచయితా మాత్రమే కారు; ప్రాచ్య పాశ్చాత్య అలంకారిక మర్యాదల్ని ఎరుకలకు పట్టించుకొన్న గొప్ప విమర్శకులు. వాల్మీకి రామాయణాన్ని గురించి, సాధికారంగామాట్లాడగలిగిన మహాపండితుడు 1965లో వెలువడిన వీరి 'షోడశి' వాల్మీకి రామాయణంలోని రహస్యాలను బయట పెట్టిన ఉత్తమవిమర్శ. 'నైషధమ్ విద్వదౌషధం' అని పేరుపొందిన శ్రీహర్షుని నైషధకావ్యాన్ని 1967 లో 'స్వర్ణహంస' అనే పేరుతో మంత్రశాస్త్రపరంగా వ్యాఖ్యానించారు శేషేంద్ర. 1968 నాటి 'సాహిత్యకౌముది' లో ప్రాచీనాంధ్ర కవుల కావ్యాలను సమీక్షించారు. నేటి తెలుగు కవితాలోకంలో వున్న అకవిత్వ దుర్వ్యాయువుల్ని దుమ్మెత్తిపోస్తూ 'కవిత్వం పారిపోయింది' అనే విమర్శ వ్రాశారు. 1975లో ప్రకటించిన వీరి 'రక్తరేఖ' తెలుగులాక్షణిక లోకానికి నూతన ద్వారాలు తెరిచింది. అసలు కవిత్వ తత్త్వాన్నే విస్మరిస్తున్న నేటి రాజకీయకలుషితమైన ధోరణుల్ని తీవ్రంగా విమర్శించారు శేషేంద్ర ఈ రక్తరేఖలో.

శేషేంద్ర ఆంగ్లభాషలో మంచిపండితులు. తమప్రతికవితనూ, ఆంగ్లీకరించే ప్రకటిస్తారు. ఇది భారతదేశంలోని ఆంధ్రేతర భాషలవారికీ, విదేశీయులకీ మహోపకారం చేస్తోంది. ఈయన సహధర్మచారిణి శ్రీమతి ఇందిరాదేవి ధనరాజ్ గిర్, సుప్రసిద్ధ ఇండో, ఆంగ్లికన్ కవయిత్రి (Partings in Memosa, Poems of My National Memory' మున్నగునవి వీరి ప్రసిద్ధ ఆంగ్ల కావ్యాలు) ఇద్దరూ కలిసి కాళిదాసు మేఘ సందేశాన్ని 'The Cloud Messenger' గా ఆంగ్లీకరించడమే కాకుండా, దానిని వాల్మీకి రామాయణంతో పోల్చి విమర్శించి 'Relationship of Meghadoot with the Epic Ramayana' అనే అమూల్యమైన గ్రంథాన్ని రచించారు. 1977లో శేషేంద్ర ఆంగ్లలేఖలు 'In defence of people An poetry' అనే పేరుతో వెలువడ్డాయి. ఇటీవలి వీరి 'కవిసేన మానిఫెస్టో' తెలుగులాక్షణిక లోకానికి నూతన ద్వారాలు తెరిచింది. సాహిత్య విమర్శలేకాక, శేషేంద్ర విజ్ఞానశాస్త్ర గ్రంథాలుకూడా కొన్ని వ్రాశారు. 'వివేచన' (1963), 'నరుడు-నక్షత్రాలు' (1963), ఊహాలో (1969) మొదలైనవి.

శేషేంద్ర కావ్యజీవితంలో నాకు ఐదు ముఖ్యదశలు కనబడతాయి. 1) సాంప్రదాయిక దశ. 2) ప్రయోగదశ, 3) భావకవిత్వదశ, 4) అభ్యుదయ కవిత్వదశ, 5) యుగకవిత్వదశ.

1) సాంప్రదాయికదశ · (స్వాహాబ్, చంపూవినోదిని)

శేషేంద్రశర్మగారు మొదటినుంచీ విశ్వనాథవారి శిష్యులు. మొదట్లో గురువుగారి లాగే ఛందోబద్ధమైన కవిత్వం చెప్పారు. ఆశుకవితలు వందలకొద్దీ అల్లారు. వీరి పద్యశైలి, ధారాశుద్ధి, అపూర్వములు. ద్రాక్షాపాకంలో సాగుతూ ఉన్నట్టుండి ప్రౌఢగంభీరముతై పోయే

వీరిపద్యాలు శ్రోతల్ని ఉర్రూత లూగిస్తాయి. శ్రీనాథుణ్ణీ, తెనాలిరామకృష్ణుణ్ణీ జ్ఞప్తికి తెస్తాయి. వీరి ఆశుధారా వేగం చూడండి :

'అలుకా నాపయి పంచదారచిలుకా !
హాల్వావు నీవున్నచో
చలికాలంబు జయింతు, సర్వసుఖముల్
సాధింతు, సాధింతు నీ
కలితక్రూర కఠోర ఘోరతర వ
క్షో రాక్షస ద్వంద్వమున్,
కలకాలంబు వసింతు, నీచరణరే
ఖా నాక లోకంబులన్'

'గంధ గజయాన ! నీదు బంగారుకొంగు
సోకినంజాలు నేను మజ్నూనవ అన్న
చూచినంజాలు దేవదాసునవ మిన్న
నీవులేకున్న బ్రతుకశే నిండుసున్న'

2) ప్రయోగదశ :- (ఋతుఘోష, పక్షులు)

1963 లో విశ్వనాథనీ, శ్రీశ్రీని, కలిపి ఒక క్రొత్తప్రయోగం చేశారు శేషేంద్రశర్మ. ఋతుఘోషలో ఛందస్సు ప్రాచీన పద్ధతిలో స్వీకరించి, ఇతివృత్తంలో పేదలబాధల్ని హృదయవిదారకంగా చిత్రించారు. బీదలపాట్లు గమనించని భగవంతుని మీద కోపగించారు. మధ్య మధ్య తాత్వికంగా అంతర్ముఖులయ్యారు. ప్రకృతిని కన్నులపండువగా వర్ణించారు. అదే ఋతుఘోష కావ్యం.

'చలిపులివోలె దారుల ప
హారులు చేయుచునుండ ఊరికా
వల పెనుమఱ్ఱిక్రింద నెల
వంకయె దీపముగా పరున్న పే
దల పసిపాపలెవ్వరికి
తప్పుదలంచిరి, కాలమే హాలా
హలమయిపోయి ఆ శిశువు
లాకలితో చలితో నశింపగన్'

'ఓపరమేశ్వరా ! ఎచట
నుంటివి నీ వస లుంటివా ? ప్రజా
శాపములన్ భరించుటకు
సాధ్యముగాదని పాతపెత్తనం
బీపయి సాగబోదని ఎ
రేని పరా రయినావ ? బాధలం
బాపగలేవు నీవు శిల
వా ? కలవా ? సెలవీయుమీ ప్రభూ !'

ఇలా తేనెసోనలుగా సాగిపోయే శర్మగారి కవిత, ఈ క్రిందనిట్టుండి కవిసార్వభౌముని ప్రౌఢత్వాన్ని పుంజుకుంటుంది :

'కమలా కంకణ కింకిణీ క్వణములన్
కందర్ప దర్పంబులన్
గమనీయంబగు సౌధవీథికల నా
నందించు దుర్మార్గ వ
ర్గములం బ్రోచెడు దేవుడే మెరుగు ని
ర్భాగ్య ప్రజాకోట్ల దు
ర్దమ బాధామయ జీవితానుదిన గా
థా గర్భ సందర్భముల్'

1969లో ప్రకటించిన 'పక్షులు' అనే కావ్యంలో ప్రాచీన పద్యఛందస్సుసగం వ్రాసి, భావకవిత్వాన్నీ అభ్యుదయ కవిత్వాన్నీ కలిపి నడిపించారు శేషేంద్ర. ఇందులో 'కలికీ ! నీవు శరత్కాదంబినీ మాలికలోంచి నేలకి దిగివచ్చిన చంద్రరేఖవా ? రాత్రివెన్నెట్లో స్నానంచేసిన చకోరసుందరివా ? వర్షాకాశ కేశావళి లోంచిజారిన ఇంద్రచాపానివా ? చెప్పవే' 'హేమంతంబున రెక్కవిప్పిన గులాబీ పువ్వులాగున్నదే, భామా నీతనురేఖ' ఇత్యాది 'రాగమయ' శృంగార వర్ణనమూ వుంది. 'చేతులన్నీ కలిప సిద్ధమయినామంటే, ఏడు సంద్రాలైన ఈది పారేస్తాము... ప్రొద్దిప్పుడే పొడిచి భూగోళమంతటా ఎర్రరంగులు పూసి వెర్రి ఎత్తిస్తోంది, నిండుకంఠము విప్పరా-సోదరా నిదురలెమ్మని చెప్పరా...' అంటూ ప్రపంచమానవుల్ని విప్లవోన్ముఖులుగా చెయ్యడమూవుంది. 'అక్షరాల యిసుకతో కవిత కట్టలేరు-తలపులనెత్తావులు చిమ్మే మృదుహృదయ సుమఘాళి కావాలి, జీవనమధూళితో తడపాలి'వంటి కవితా సూక్తులున్నాయి ప్రపంచంలోని యావ దాపన్న జనుల్నీ తనజాతిగా భావించే మహోదాత్తమైన మానవత వుంది. గత చరిత్రను గ్రుడ్డిగా పొగడుతూ వర్తమానదారిద్ర్యాన్ని విస్మరించే పలాయనవాదం నలుసంతైనా లేదు. ఒక్కొక్కచోట ఏవాదాల జోలికీ పోకుండా కేవలం ప్రకృతి సౌందర్యాన్ని తన్మయత్వంతో వర్ణించిన కవితాఖండికలూ వున్నాయి. కలకూజితాలు పెడుతున్న రకరకాల పక్షుల్ని ఒక సీసపద్యంలో రసవంతంగా వర్ణించారు శేషేంద్ర.

పచ్చని నునురెక్క పైట దాల్చినచిల్క
గొంతెత్తి పిల్లనగ్రోవినూదె
సంపెంగ ముక్కును సవరించి పిచ్చుక
జలతరంగిణి మీటె శ్రావ్యసరణి
శబలచూడము తలన్ చలియింప వడ్రంగి
ఖేలగా తియ్యని యీలవేసె
గుమ్మడి పూవన్నె కుక్షి కదల్చుచు
భరతపక్షి సితారు పలకరించె

గరుడపక్షియు నీలాలగగన సీమ
దిరిగిసన్నాయి వాయించి తేనె గురిసె
కుసుమ పీఠిక తుమ్మెద కూరుచుండి
తంబురస్మీటి శ్రుతిగూర్చె ధరణి కెల్ల'

3) భావకవిత్వదశ. (శేషజ్యోత్స్న)

'ఋతుఘోష', 'పక్షులు' అనే కావ్యాల్లో శేషేంద్ర ఎక్కువగా వేదనాజీవిగా కనిపిస్తారు.

ఈ వేదనాజీవి 'శేషజ్యోత్స్న'లో ప్రేమోపజీవి అయ్యారు. అందులోనూ విరహజీవికాక ప్రేమ సాఫల్యాన్ని, పొందిన అదృష్టజీవి అయ్యారు. అయినా సరే మోహాన్ని అలవాటుగా మార్చుకోలేదు. R S. సుదర్శనంగారు చెప్పినట్లు శేషేంద్ర, ప్రేమను తపస్సుగా, దర్శనంగా, ఆత్మసాక్షాత్కారంగా అనుభవించారు. ఆ అనుభూతే శేషజ్యోత్స్న కావ్యంలో మధుర కవితాస్రవంతిగా మనకు దర్శన మిస్తుంది.

'మబ్బుల వలువలు విడిచి
రాత్రి నగ్నంగా వెన్నెట్లో
స్నానం చేస్తూ ఉంది,
పూల నెత్తావులతో గాలి
గుసగుసలాడుతూ ఉంది;
నీవువస్తా వన్న నిరీక్షామధువు చప్పరిస్తూ
ఎద మత్తులో ఒత్తిగిల్లింది;
కల లెగిరి పోతాయేమో అని
కన్నులు ముకుళించాయి, రేకుల్లో
తేనె దాచుకున్న పుండరీకాల్లా-
మల్లెపొదకు తగులుకున్న
దేశద్రిమ్మరి చంద్రిక
నీ నెమ్మేని వలువ అని
నా చేయి పట్టుకోబోయింది'

ఇటలీలోని 'వీనస్ డె మెలో' అనే త్రిలోకసుందరి విగ్రహాన్ని చూసి శేషేంద్ర వ్రాసిన 'నీవు' అనే కవితా ఖండిక, శ్రీశ్రీ మహాప్రస్థానంలోని 'కవితా! ఓకవితా!' అనే గేయాన్ని జ్ఞప్తికి తెస్తుంది. ఇది శేషజ్యోత్స్నకు మకుటాయమానమైన గేయం. అతిలోక సుందరమైన ఆ విగ్రహాన్ని చూస్తూ కవి తన్మయుడై తన్నుతాను మరచిపోతాడు. మిన్నులు విరిగిన నీలిశకలాలవంటి ఆమె కన్నులు, రెండు విహంగాలు గా, రెక్కలు వచ్చిన రెండు ఇంద్రనీలమణులుగా అనంత వీధుల్లోకి ఎగిరిపోతాయి. కవికి ఒక మధురమైన నిదుర వస్తుంది. ఆ నిదురలోకి ఒక తియ్యటి కల రాజ్యం చలా ఒయ్యారంగా, తెలిమబ్బుతునకలా తేలియాడుతూవస్తుంది. కవి సంతోష పూరిత-బెలూనులా ఆకాశపు నీలిబాహువుల్లోకి ఎగిరిపోతాడు. అతడు వీనస్ కోమల పాదలతాగ్రాలు పూచిన పుష్పమై, ప్రేమమకరందంతో నిండిపోతాడు. ఆమె కౌగిట్లో కవి ఒక దివ్యానుభూతిని పొందుతాడు.

'ఓహో! ఏమి జరిగింది నీకౌగిట్లో నాకు!
తొలి ఋషులు అగ్నికీలల్లో
మంత్ర గ్రామాలు దర్శించినట్లు
నీకౌగిట్లో ప్రేమజ్యోతిని చూచాను
నేను నీఛాతిక మూర్తికోసం రాలేదు.
వచ్చానొక కిరణంకోసం
ఒక కవితాచరణం కోసం
కిరణాల్లో స్నానంచేసాను
మృదుమధుర స్మరణాల్లో గానంచేశాను
నన్ను నేను చేరుకున్నాను'

4. అభ్యుదయకవిత్వదశ : - (మండే సూర్యుడు)

'శేషజ్యోత్స్న' లోని ఆదర్శవంతమైన వైయక్తిక ప్రేమానుభూతి 'మండే సూర్యుడు'లో విప్లవాన్నీ, వీరమరణాన్నీ ఉద్ఘోషించే సామాజిక చైతన్యంతో కూడినమానవతావాదంగా పరిణమిస్తుంది.

అసలు శేషేంద్ర కవిత్వాన్ని విడదీయటం కష్టం. అందులో సౌందర్యం, సంప్రదాయం, అభ్యుదయం ముప్పిరిగొని వుంటాయి. ఏది యెక్కువగా వుందో దాన్నిబట్టి పేర్లు పెడుతున్నాను. సౌందర్యోపాసనకు పరాకాష్ఠ అయిన శేషజ్యోత్స్నలోనే సామాజిక స్పృహతో విప్లవచైతన్యంతో అభ్యుదయకిరణాలతో 'మండేసూర్యుడు' ఉదయించాడు. మానవతావాదంతో ప్రజ్వలించే కవి హృదయానికి ఈ మండేసూర్యుడు గొప్ప సంకేతం. ఆర్. యస్. సుదర్శనం గారి మాటల్లో చెప్పాలంటే ఈ కావ్యంలో 'మానవచరిత్ర'మానవుని జయాపజయాలు మానవుని ఆశలు, మానవుని భవిష్యద్వర్తమానాలూ, అన్నీ అన్ని కవళికలుగా అభివ్యక్తిలో దర్శనమిస్తున్నాయి' :

'నేను చెమట బిందువుని
కండల కొండల్లో ఉదయించే
లోకబంధువుని
గుండెలతో నాకు దోస్తీ
నే నుండేది బాధలబస్తీ
సింధువంత చరిత్ర నాపిడికిట్లో వున్నా
చెప్పకుండా మనిషిని చెక్కిన శిల్పిని
చెట్లకు వ్రేలాడిన శిరసులు పూస్తున్నాయ్
కొమ్మల్లో పూలై
గోలీదూరిన గుండెలు కదలుతున్నయ్
గుడిలో గంటలై
సూర్యుడు ఈ శుభదినాన్ని మోసం
చెయ్యనివ్వను
ఈ దేశపు ప్రాచీరేఖమీద సూర్యుడు
ఉదయించకపోతే
మండే నా గుండె చీల్చి
దానిమీద పెడతా
ఎర్రటి నాకండలతో ఎండలు కాయిస్తా'

ఇలా ఒకప్రక్క విప్లవజ్వాలల్ని మండిస్తూనే, వేరొకప్రక్క శేషేంద్ర ప్రకృతిలోని అపూర్వ సౌందర్యాన్ని ఎలా దర్శిస్తారో చూడండి .

వర్షం కురిసింది. మొక్క మొలుస్తోంది. 'జలదానం చేసిన మేఘాలకి జోహార్లు చెప్పాయి చరాచరాలు. భూమిలోఉన్న చిన్నారిగింజ మెడబయటపెట్టి మొదట వచ్చిన రెండాకుల్ని చేతులుగా జోడించింది కృతజ్ఞతతో.

(సశేషం)

# శివభారతం - సమాలోచన

- టి. భాస్కరరావు, ఎం. ఏ., ( స్ఫూర్తిశ్రీ )

'పరహిత మాత్మనిర్వృతి యపార యశోధన గౌరవాది వి
స్ఫురణము లందఁజేసి యిహమున్ బరము నెల్వయించి, మానవున్
ధరఁ జరితార్థుఁ జేయు కవితాకళ నా వశమాటఁ బంచమ
స్వరమున నాలపించెద వసంత వనాంత రసాలశాఖలన్'

అని దక్షతతో దీక్షపట్టిన మహాకవి గడియారం వేంకటశేషశాస్త్రిగారు. ఆయన శతావధాని. 'అవధాని పంచానన' 'కవిసింహ' బిరుద సమ్మానితులు. శివభారత కవిగా స్థిరప్రతిష్ఠులు.

'ధీరాగ్రేసరమూర్తి, హైందవధరిత్రీభాగ్యసత్స్థాపన
ప్రారంభుండు, దయాగుణాంబుధి, మహారాష్ట్రాన్వయోత్తంసుఁడౌ
వీరక్షత్రియమౌళి, భవ్యభరతోర్వీధర్మ రక్షార్పిత
శ్రీరమ్యుండు, భవానిభక్తుఁడు శివాజీరాజు సామాన్యుఁడే'

ఇన్ని విశిష్టగుణాలు కలిగినందువల్లనే శేషశాస్త్రిగారు శివాజీని నాయకునిగా చేసి మహాకావ్యం రచించారు.

'అతని చరితము హైందవ
జాతిపరాయణము, భావిజగదభ్యుదయ
స్ఫీతము, ధర్మోపేతము,
నీతిపథము,నిగమసూక్తినిభమై వెలయున్'

శివాజీ చరిత్ర మట్టుకే కాదు-గడియారం వారి శివభారతంకూడా ఆయా విశేషణాల కక్షరాలా అన్వయిస్తుంది. కవి శివభారత మన్న పేరు పెట్టడంలోనే ఒక గడుసుదనం ప్రదర్శించారు. 'తింటే గారెలే తినాలి, వింటే భారతమే వినాలి' అన్న సూక్తి తెలుగువారికి తెలియనిది కాదు. తెలుగుభాషలో భారతానికున్న ప్రశస్తి కిది సంకేతం. గడియారంవారు తమ గ్రంథానికీ అంతటి ప్రశస్తి నాశించారు, గడించారుకూడా. ఆధునికాంధ్ర మహాకావ్యాలలో శివభారతం మణిపూసగా మాన్యత సంపాదించుకుంది.

శివాజీ శివుని అపరావతారం, ఈ విషయాన్ని కథాముఖంగా ఎన్నోసార్లు చెప్పారు గడియారంవారు; పాత్రలచేత చెప్పించారు. అయినా తృప్తి కలుగలేదు. నిర్మాణాశ్రితమైన తమ మార్మికతను ఆశ్వాస సంఖ్యను బట్టికూడా ఆవిష్కరించారు. శివభారతంలో ఎనిమిది ఆశ్వాసాలున్నాయి; శివుడు అష్టమూర్తి శివాజీ చరిత్రను అష్టాశ్వాసమిరిమితమైన ప్రబంధంగా నిర్మించడంలో అష్టశరీరుడైన శివుడే కావ్యనాయకుడైన శివాజీ అన్నది ప్రతీయమాన మవుతుంది.

కథాప్రారంభానికి ముందుండే విషయాన్ని శ్రవ్యకావ్యంలో కృత్యాది అనీ, అవతారిక అనీ పిలవడం పరిపాటి. కాని, శివభారతకర్త రూపక మర్యాద ననుసరించి నాందీ ప్రస్తావనలు రచించడం ఒక చమత్కారం. కేవలం చమత్కారమే కాదు-తనకావ్యంలో నాటకీయతకే రూపకపద్ధతికే ప్రాధాన్యం అన్న విషయాన్ని స్ఫురింపజెయ్యడము మొదలయినవి వాంఛితమైన స్ఫూర్తిని మూర్తికట్టిస్తున్నాయి.

సామెతలవంటి సమత గల వాక్యాల వల్లా, అర్థాంతరన్యాసవిన్యాసం వల్లా, క్రియాపదాలను వెంటవెంట ఉపయోగించడంవల్లా, అంత్యప్రాసల వాడకం వల్లా, సజాతీయ వర్ణావృత్తులవల్లా, సముచితాలంకార సంధానంవల్లా గడియారంవారు అక్షర రమ్యతను లక్షలవిలువగా సాధించి ఆరాధించారు.

ఇదంతా ఒకయెత్తు; రసపోషణ ఒకయెత్తు. శివభారతంలో ధర్మవీరం ప్రధాన రసం. ఇతర రసాలు అంగరసాలుగా ఆయా సన్నివేశాల్లో ఆవశ్యకమైన పుష్టిని పొందాయి.

కవి ప్రస్తావనలో 'దాన దయా శమ ధర్మ వీర వర్తనుడు' అని శివాజీని పేర్కొంటారు. దానవీరుడు, దయావీరుడు, ధర్మవీరుడు, యుద్ధవీరుడు - అని చెప్పడమే కాక శాంతవీరుడుగా కూడా చెబుతారు. ఆలంకారికులు 'శాంతవీరం' చెప్పలేదు. గడియారంవారికి ఈ అంతర్భాగంకూడా అభిమతం కావచ్చు. శివాజీ తుకారామును సత్కరించడమూ, రామదాసస్వామిని సందర్శించడమూ, ధర్మాధర్మవివేచన చెయ్యడమూ, హింసాహింసలను అవలోడన గావించడమూ శమస్థాయికమైన శాంతరసాన్నే సంకేతిస్తున్నాయి. అయితే, యిది వ్యక్తినిష్ఠమయిన శాంతినీ నివృత్తి రూపమైన శాంతినీ కాక, సమాజపరమైన శాంతినీ ప్రవృత్తిరూపమైన శాంతినీ సంకేతించడం చేత దీనిని శాంతవీరంగా పేర్కొనడమే ఆయన మనస్కారం. కథానిర్వహణలో ఆఖ్యానశైలినీ, వర్ణన శైలినీ మించి నాటకీయశైలిని ఉపయోగించుకోవడం సర్వత్ర ఉజ్జ్వలంగా కానవస్తుంది వర్ణనలనుకూడా పాత్రముఖంగా నిర్వహించిన పట్టులేయెక్కువ.

షాజీ ఖాండదేవును పంపుతూ 'తగు సూత్రధారుడవు నీవ గదయ్య స్వరాజ్య నాటికన్' అని అంటాడు. ఖాండదేవు చనిపోతూ శివాజీతో చెప్పిన మాటలు ఈ భావాన్ని ఆవృత్తి చేస్తున్నాయి -

'ఒకపరి ఖాండదేవుడు గు
రూత్తము డీ శివరాజు కంచు, మా
మక చరితంబు నీ విజయ
మంగళ నాటక పూర్వరంగ మా
టకుఁ దగె; నాయకుండు ప్రక
టంబుగ రంగమునెక్క సూత్రధ
రకు బలె భూమికాంతర పు
రస్క్రితికె తెరచాటు కేగదన్'

ఈ మాటల్లో దాదోజీ ఖాండదేవు శివాజీ నిర్వహిస్తున్న పాత్రను ఎంతగా తీర్చి దిద్దాడో వ్యజ్యమానమవుతుంది. ఇది విజయమంగళ నాటక మట! నాయకుడు శివాజీయే. తాను సూత్రధారుడు; కాబట్టి నాయకుడు రంగప్రవేశం చేశాక తాను రంగంమీద నిల్వకూడదు. సన్నివేశానికి సరిగ్గా అతికినట్లు సరిపోయింది యీ కల్పన. సంభాషణ క్రమంలో స్వయంభువుగా, సహజంగా వెలువడింది. ఇంతకుముందు, శివాజీ అపమార్గంలో పడుతున్నాఁడనుకుని ఖాండదేవు హెచ్చరించినప్పుడు శివాజీ యిచ్చిన సమాధానం – ప్రతి భాగంలోనూ కవిశిల్ప పనితనం కల్పలతగా అల్లుకుంది. దాదోజి ఖాండదేవు, బాజీప్రభు, తానాజీ, సూర్యాజీ, జయసింగు, జశ్వంతసింగు మొదలయిన పాత్రల చిత్రణ నిండుగా నిబ్బరంగా సాగింది. నగర పర్వత సూర్యోదయ సూర్యాస్తమయాది వర్ణనలూ, యుద్ధ మంత్ర దౌత్య ప్రయాణ మృగయా వివాహ పుత్రోదయాది వర్ణనలూ నిర్వహింపబడిన తీరు ఔచిత్యానికి తీరు తియ్యములు నేర్పుతుంది.

పురాణ జ్ఞాపికలవల్ల విస్తృతమైన భావాన్ని సజీవంగా, సంక్షిప్తంగా వెల్లడించవచ్చునన్న కీలకం కవిగారు లీలగా అందిపుచ్చుకున్నారు. దానితో ఎక్కడ లేని జిగినీ బిగినీ దక్కించుకున్నారు. షాజీ లుకజీతో –

'మన మహారాష్ట్ర భూదేవి మునిగియున్న
దుద్ధతారిబలాంబుధి; నుద్ధరింపఁ
జూరుము వీర వరాహబంధురత మెరసి'

అని అంటాడు. పురాణ ప్రసిద్ధమైన వరాహావతార గాథ మొత్తంసన్నివేశాన్ని చైతన్యచకచ్చకితం చేస్తున్నది. ఇలాగే

'కంసునకుం బాసిన వాసుదేవుడవటంచున్
మిమ్ము భావింతు'

'జీజియాబాయి తొంటిసత్యభామనిజము'

'భర్త నెడబాసి వాల్మీకి పదములంటి,
పనవుచున్న సీతను దలంపునకుఁ దెచ్చు,
జీజియాబాయి'

'పతిరాక లరయు చామె కణ్వు చెంత
శకుంతల కరణి నుండె'

'ఇందలు మావళాజనము
లీ గిరి కానన కుంజ వాటికా
కందర భూముల న్నిలిచి
కష్టములన్ బడుచుండ, నేను రా
జ్యేందిర కౌఁగిలింత రమి
యింతునె? వారికి నేను–నాకు వా
రందఱు ముక్కుపై కలిసి
యాడెద మిందు స్వరాజ్యనాటికన్'

అని శివాజీ తాను స్వరాజ్యనాటికను ఆడుతున్నట్లు పేర్కొంటాడు. సందర్భ సముచితంగానే ఉన్న యీ మాటలు కవిగారి హృదయంలో అంతర్నిహితంగా ఉన్న నాటకీయరీతికి ద్యోతకంగా వ్యవహరిస్తున్నాయి.

శివాజీ పుట్టుక, జీజియాబాయి శిక్షణ దాదోజీ ఖాండదేవు గురుత్వం, శివాజీ వివాహం, గోరక్షణ విజయం, రాజకీయ పరిజ్ఞానం, మావళా సైన్యసమీకరణం, కోటలను పట్టుకోవడం, శత్రువులను ఎదుర్కోవడం – మొదలైన అనేకాంశాలతో నడిచిన యితివృత్తం శివాజీ పట్టాభిషేకంతో శుభాంత మవుతుంది. 2389 పద్యాలుగల యీకావ్యం అనవసరమైన విషయాలజోలికి పోకుండ, అవసరమైన విషయాలను విడవకుండా నడిచి జిగినీ, బిగినీ సంతరించుకుంది.

శివాజీ తండ్రి షాజీ. శివాజీలో జీవిత సర్వస్వమై విస్తరించుకున్న స్వధర్మ రక్షణ, స్వతంత్రరాజ్య స్థాపన బీజప్రాయంగా షాజీలో ఉన్నాయి. కాని, యెన్నో యెదురుదెబ్బలవల్ల తాను తన ఆశయాలకు రూపు దిద్దుకోలేకపోయాడు. లుకజీ నిజాముకొల్వును, విడిచి తనతోపాటుగా మొగలుకొల్వులో చేరుమన్నప్పుడు తమ్ము నమ్ముకున్న నిజామును విడిచిపెట్టడం ధర్మంకాదనీ, కృతఘ్నత అవుతుందనీ, అయినా దేశదాస్య విమోచన కయితే తాను సిద్ధమే అనీ చెబుతాడు షాజీ. కాని లుకజీ అల్లుని మాటలను పెడచెవిని బెట్టడమే కాక, అతనిమీద పగసాధించే ప్రయత్నం కూడా మొదలుపెడతాడు. ఆ ప్రయత్నంలోనే ఒకమారు శ్రీనివాసరావింటిలో ఉన్న జిజియాబాయి యెదుట అల్లుడు తప్పించుకున్నాడనీ, చేతకానివాడనీ దుర్భాష లాడతాడు. జిజియా కాత్యాయని లాగా ముందుకు దూకింది. ఆనిన సింగంలాగా ఎదుర్కొంది. 'నువ్వలు కూడ కాన్పులను కూరిమిఁ బెంచు జగంబునందు నీ వెవ్వడవయ్య! ఆదరణ కెక్కరె యల్లుడు నాడుబిడ్డయుఁన్' అని నిలదీసి అడిగింది. మెత్తని మాటలతో తండ్రి చిత్తాన్ని కరగించింది. షాజీ రాజకీయ కారణంగా మరో వివాహం చేసుకున్నప్పటికీ భర్తయెడల తన ప్రేమ తరిగిపోలేదు. అంతటి అచంచలప్రేమనే భర్తనుంచి తానూ పొందగలిగింది. జిజియా నుద్దేశించి షాజీ –

పూవులకన్నఁ గోమలము
పూజ్యము భారత భూ పతివ్రతా
దైవము; సుప్రసాదమిళి
తంబుగ నాయువ చూచెనేని సు
శ్రీవిభవమ్ములన్ గురియు
రేగి కనుంగవ జేవురించినన్
గావిరి కప్పు నిప్పులుబు
కన్ జగమెల్ల దహింపకుండునే'

అని అనుకుంటాడు. తన గౌరవాన్ని సర్వస్త్రీజాతియెడలా ప్రకటిస్తాడు.

'యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః' అన్నది తన అంతర్యం.

అటువంటి ఆదర్శదంపతుల పుణ్యఫలం శివాజీ. చిన్నతనంనుంచీ పురాణ వీరుల గాథలు చెప్పి జిజియాబాయి శివాజీని ఆదర్శనీయునిగా, ధర్మరక్షణపరాయణునిగా దిద్దింది. 'ధర్మో రక్షతి రక్షితః' అన్నదే తన విశ్వాసం. ఒకమాటు మొగలులవల్ల కలిగిన బాధలు చెబుతూ–

# తెలుఁగు రుబాయాలు

"కవిగణపతి"

ఆమె కెడఁగూడి విహరించునతఁడు నరుఁడు
ఆమె యధరామృతము గ్రోలునతఁ డమరుఁడు.
ఆమెతోఁ గూడి సయ్యాటలాడి కూడ
సతము విరహసంతప్తుఁడౌ నతఁడు నరుఁడు.

ఆమె యెదురైనచో శశి నసలె తలఁప
ఆమె తాకుచో తనుగాలి నసలె తలఁప
ఆమెతో నున్న సమయమ్ము నందు నేను
పొసఁగు ప్రేమకవిత్వము నసలె తలఁప.

ఎడఁద నుంకువగా ఆమె కీయనుంటి
ఇల్లడమ్ముగ నాదు మేనీయనుంటి
చూచి తాఁకి వానిని చాన నాఁచికొనియె
ఇప్పుడిఁక నేను ఆమె కేమీయ నుంటి?

చాన రంభయేవి కనగ శక్తి తొలఁగు
చావుమీఁద నేని మిగుల సక్తి కలుగు
మధువులేని దినము త్రాగుమానవునకు
మంతెఁడైన దొరకెనేని ముక్తి కలుగు.

* ఉర్దూలో రుబాయీల పేర కవిత్వమున్నది. ఆ ఛందమునకు మన తెలుగులోని తేటగీతులకు మాత్రలసామ్యమున్నది. రదీఫ్, ఖాఫియా నియమములతో తేటగీతులలో ఆంధ్ర సాహిత్యమున వ్రాయబడిన తెలుగు రుబాయీలు ఇవి.

---

( 14 వ పేజీ తరువాయి )

'కన్నుల పండువై తనువు
  గాంచినగోవుల నిండుపైరులన్
గన్నుల విప్రులన్ జెఱచి
  గండతనమ్మునఁ గాడు బీడుగాఁ
దన్నుచు దన్నుచున్ మొగలు
  దండులు రా_నదలించి ధీరతన్
వెన్నడిఁ బారఁద్రోలఁగల
  వీరుఁ డొకం డిల లేకపోయెనే'

మొదలయినవిధంగా తన ఆవేదనను వెల్లడిస్తుంది జిజియా. శివాజీ వెంటనే బాల్య చాపలాన్ని పక్కకు నెట్టి సప్రశ్రయంగా, సముదాత్తంగా, ఈవిధంగా అంటాడు–

'కార్తవీర్యుడు గొన్న కపిలధేనువుఁ దేర
  రణభీము భార్గవ రామునట్టు
లేకచక్రపురంబు నెఱయించు బకు గెల్వ
  ద్విరదాయుతస్థేము భీమునట్టు
లాదితేయుల గెల్చి యమృతకుంభముఁ దేర
  దత విపక్షు దిధక్షుఁ దార్క్ష్యునట్టు
లమరసామ్రాజ్యాపహర్తయౌ బలిఁద్రొక్క
  మాయావతార వామనుని యట్లు
పనుపుమీ నన్ను; సంశయపడకు తల్లి!
అమృతవాక్కుల దీవించు మదియ చాలు;
చలము బలమును శక్తియుక్తులను జూపి
జయము గొనివత్తు; నీమనశ్శరముఁ బుత్తు'

తల్లి శిక్షణ చేకూర్చిన పురాణగాథా ధౌరంధర్యమూ, ఖాండదేవు దందించిన ప్రచండ రణశిక్షా శౌండీర్యమూ, ఆదర్శ నాయకోచితమైన అహంకార దూర గాంభీర్యమూ, దర్శనమిస్తున్నాయి. బాల శివుని వాక్కులలో.

సాధారణంగా కావ్య పాత్రలు సర్వాంగీణ సౌష్ఠవంతో కానరావు కాని, శివభారతంలో శివుడు సర్వాంగీణంగా– కొడుకుగా, శిష్యుడుగా, నాయకుడుగా, భర్తగా, తండ్రిగా, నెచ్చెలిగా, భక్తుడుగా, వీరుడుగా, రాజకీయతంత్రజ్ఞుడుగా, ఆదర్శప్రభువుగా, మహామానవుడుగా సాక్షాత్కరిస్తాడు. ప్రజల నిరీక్షణలో–

'మెరుపులవంటి చూపు, నులి
  మీసలబుగ్గలనంటు గడ్డపుం
బురుజులు, ముళ్ళకన్బొమలు
  పర్వగ జేగురుగొన్న మోముతోఁ
దురగము నెక్కి నల్గడల
  దూకు మహారథు'

డని శివాజీ బాహ్యరూపాన్ని కూడా కవిశ్రీ కళ్ళయెదుట బొమ్మకట్టించారు.

తిక్కన భారతగ్రంథాన్ని 'ప్రబంధ మండలి' అన్నాడు. అలాగే శివభారతం కూడా అఖండకావ్యమే అయినా అనేక లఘుకావ్యాల సంపుటి యనడం సమంజసం. దాసబోధలో దీని ఛాయ కొంత కనిపిస్తుంది.

పట్టాభిషేకానంతరం శివాజీ భవానీ మాతను సేవిస్తూ–

'నాకొఱకే వరంబునయి
  నన్ మదిఁగోర, భవత్పదాబ్జసే
వా కృతి చాలు; చాలిన శు
  భంబులు హైందవభూమికిమ్ము; నే
సాకిన జాతి నీతి మత
  సత్యపథం బెపుడైన వమ్ముగా
నీక వెలుంగఁజేయు మిది
  యే మదభీష్టశతంబు శాంకరీ!'

అని 'మత జాతి నీతి దైవతభక్తి మహితమై హైందవజగము పెంపారుగాక' మొదలయిన విధంగా తన అభీష్టాన్ని నివేదించుకుంటాడు శివాజీ. ఈ చివరి ఘట్టం భరతవాక్యప్రాయంగా వ్యవహరిస్తున్నది. నాందితో మొదలయిన కావ్యం భరతవాక్యంతో ముగియడం ఆద్యంత సమన్వయాన్ని అందంగా అంది పుచ్చుకోవడమే కదా!

గడియారం శేషశాస్త్రిగారు శివభారతంతో ఆంధ్రసాహిత్యహర్మ్యంలో అనర్ఘ రత్నదీపికను నెలకొల్పడమేకాక, నవభారతానికే చైతన్యపు నివాళు లెత్తారు; వెలుగుబాటలు వేశారు.



# విశ్వనాథవారి సాహిత్య విమర్శ

(గతసంచిక తరువాయి)

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం ఏ.

## పీఠికలు

ప్రాచీనయుగంలో ప్రతి కావ్యానికీ 'అవతారిక' ఉండేది ఇందు కవిచేత స్వయంగా వ్రాయబడి ఆ కావ్యంలోని విషయం పరిచయం చేయబడుతుంది. నేటి కాలంలో అవతారికల స్థానాన్ని పీఠికలు ఆక్రమించాయి. ఇవి ఇతరులచే రచింపబడతాయి. గ్రంథపరిచయం చేయడమే వీటి ముఖ్యప్రయోజనం. కావ్యావతారిక లక్షణ పరిశీలనకే పరిమితంకాగా పీఠిక లక్ష్య పరిశీలనకుకూడా స్థానం కలిగిఉంది. తొలిపలుకు, మున్నుడి, ఆముఖం, ఉపోద్ఘాతం, ప్రస్తావన, ప్రవేశిక, ప్రకాశిక, భూమిక మొదలైనవి పీఠికకు పర్యాయపదాలుగా నేడు వాడుకలో ఉన్నాయి.' (మహతి_281, 282 పే)

విశ్వనాథవారు వెలువరించిన పీఠికలు ఆయన విమర్శనా యజ్ఞవాటికలు. వీటియందనూ సత్యనారాయణగారి ప్రత్యేక వైఖరి ప్రస్ఫుటమవుతుంది. నన్నయగారు భారతగాథలోని ఆయువుపట్టును పట్టుకొన్నట్టు, విశ్వనాథవారు కావ్యంలో బీజభూతంగా నిక్షేపింపబడిన ప్రాణాన్ని పట్టుకొని విమర్శిస్తారు. విభిన్న గ్రంథాలపై, వారు ప్రవచించిన పీఠికలు వారి అసాధారణ ప్రజ్ఞావైభవాన్ని, బహుముఖమైన శాస్త్ర వైదుష్యాన్ని చాటి చెప్తున్నాయి. ఒక్కొక్కటీ ఒక్కొక్క మణిపూస.

హంపీక్షేత్రము:_ ఇది కొండాలి సుబ్బారావుగారిచే రచింపబడిన ఖండకావ్యం. ఆధునిక ఖండకావ్యాలలో ఇది చాల ప్రసిద్ధిగాంచింది. దీనికి 'ప్రవేశిక' వ్రాస్తూ విశ్వనాథవారు 'కావ్యమునకు రీతియాత్మ యనినారు కొందరు. పూర్వాంధ్ర కవులలో రీతియలవడని కవిత కలవారు లేరు. నేటి కాలమున చాలమంది యున్నారు. సుబ్బారావుగారి కవితకు రీతియున్నది. అది వైదర్భి. కంకంటి పాపరాజురీతి. అందుకని అతని కావ్యము తక్కువరకములోనిదికాదు. బ్రతికి బట్టకట్టినచో సరస్వతీదేవిచేత పట్టుసెల్లాలు కట్టించెడివాడే కవి. కావ్యగుణములు మహాకవి లక్షణములు. అవి సర్వము బీజప్రాయముగ నీ చిన్న కావ్యమందే యున్నవి అనేక గుణము లీచిన్ని పాత్రములో నున్నవి. అందుచేత విషయబాహుళ్య మెక్కువ, విస్తరింపు తక్కువ యైనది. ఇందందు శబ్దగత దోషములు కలవు. ఇవిచాల స్వల్పములు. మహారాజ, కలబడె, హార్తకును మొదలైనవి. పరజా అను శబ్ద మీయన ప్రయోగించెను. ఇది అన్యదేశీయము. దీని నే శిష్టుకృష్ణమూర్తికవి పరదా యని ప్రయోగించెను. ఇది పుర్రాశబ్దభవము ఈదోషములు బహు గుణకమైన ఈకావ్యములో పట్టింపుకు రావు. 'ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి.' (20_1_33)' అం కూలంకషంగా విమర్శించి గుణదోషవిచారణ చేశారు. నాలుగు దశాబ్దాల క్రితమే వారి విమర్శనాస్థాయి పైవిధంగా ఉండగా సహస్రమాస జీవియైనవారు చివరి దశలో వ్రాసిన వ్యాఖ్యానాలు ఎంత ప్రతిభా వైశిష్ట్య ద్యోతకాలో ఊహించవచ్చు.

ఆంధ్రపురాణం _ శ్రీ మధునాపంతుల వారి ఈఉద్గ్రంథానికి పీఠిక వ్రాస్తూ (8_2_1953) విశ్వనాథ 'అధునాతనాంధ్రసారసత్వమున నీ ఆంధ్రపురాణముతో మరియొక మహాగ్రంథ ముదయించిన దని చెప్పవచ్చు' ననీ, ''పూర్వాంధ్రకవి చరిత్ర విషయమున శ్రీ వీరేశలింగంపంతులుగా రెంత చేసిరో యధునాతనాంధ్రకవి చరిత్రమునకు శ్రీ సత్యనారాయణశాస్త్రిగారంత చేసి రని (5 పే) ప్రశంసించారు.

సాతవాహన రాజులు ముప్పదిమంయని వ్రాశా రనీ నిజానికి ముప్పది యిరనీ, వారందఱూ కలిసి 506 సం॥ పాలించగా ఇందు 454 ఏళ్లు మాత్రమే అశాస్త్రిగారు రచించారనీ ఖండించి, ఈ దోషాలు పాశ్చాత్యుల ననుసరించి వ్రాసిన మన చరిత్రకారులవి కాని కగారివికావని చివరలో సమర్థించారు విశ్వనాథ. ఎందుచేతనో ఇప్పటి ముద్రణంలో ఈపీఠిక తొలగించబడింది.

సమగ్ర ఆంధ్ర సాహిత్యం_ఆరుద్ర 2వ భాగం:_ విశ్వనాథవారి విమర్శ గ్రంథం విలువకైనా నికషోపలం వంటిది అందుకే రచయితలు తమ పుస్తకాలకు మున్నుడి వ్రాయండనీ, అభిప్రాయం వ్రాయం డనీ విశ్వనాథవారి వెంటపడేవారు. ఆయన నిస్సంకోచంగా విమర్శిస్తారని తెలిసినా అదికూడా తమ పుస్తకాలకు ఒక విలక్షణత్వాన్ని, ప్రత్యేకతనూ, విలువనూ సంతరించి పెడుతుం దని భావించేవారు రచయితలు.

అలాగే ఒక బృహత్తర ప్రణాళికతో ఎంతో శ్రమించి 12 భాగాలుగా వెలువరించిన 'సమగ్రాంధ్ర సాహిత్యం' విలువ కడుతూ మరుగు పడిపోయిన కొందరు కవుల పుస్తకాల్లోనుంచి లక్షణగ్రంథకర్తలు ఉదాహరించిన పద్యాలనుబట్టి మాత్రమే వారిఉనికి తెలియ వస్తూఉండగా ఇటువంటి కవుల పద్యాలన్నీ వారి పేర వ్రాసిన శీర్షికలో ఉదాహరించడం చాలామంచిపని అనీ, కొందరు కవుల కాలమునుగూర్చి ఇప్పటివరకూ వెలువడిన భిన్నాభిప్రాయాలు ఒకచోటకూర్చి పెట్టడం ఈసాహిత్యంయొక్క విశిష్టత' అని విశ్వనాథ ప్రకటించారు.

ఈ సంపుటానికి తాను పీఠిక వ్రాయాలని సంకల్పించడానికి గల మూడు కారణాలను వివరిస్తూ 'ఒకటి_మద్దూరి నరసింహారావుగారియందు నాకున్న మొగమాటం. రెండు_ఈ గ్రంథకర్తయే పీఠిక

వ్రాసిపెట్టమని నాకు వ్రాయటం. మూడ వదైనా మొట్టమొదటిది దీని ప్రథమ సంపుటాన్ని యాదృచ్ఛికంగా ఎక్కడో చూచి 'శ్రమపడి వ్రాసినాడు' అన్న అభిప్రాయం కలిగి, ఎవరో అడిగితే ఆ అభిప్రాయం చెప్పడం' అని అంటారాయన.

విశ్వనాథవారికి చాలాగర్వం అనీ, తానొక గొప్ప పండితు డని అహంకార మనీ, పెక్కుమంది వ్యాఖ్యానించడం అందరకూ తెలిసినవిషయమే. కాని తాము సర్వజ్ఞులముకామనీ, కొన్ని విషయాలలో తాను విమర్శించడానికి తగ ననీ నిస్సంకోచంగా చెప్పేస్వభావంగల వ్యక్తిగా విశ్వనాథ కనిపిస్తారు. దాని కీసాక్ష్యం ఒక్కటి చాలు.

"నిజంగా పడితే నేను దీనికి పీరిక వ్రాయకూడదు. మొదటి సంపుటానికి బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు వ్రాసారు. న్యాయం పడితే తరువాత వ్రాయవలసినవారు శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు. మా గురువుగారియొక్క శిష్యులలో అందరికంటె పెద్దవాడు శివరామశాస్త్రిగారు. తరువాత శ్రీ లక్ష్మీకాంతం నేను మూడవవాణ్ణి. నిజంగా శ్రీ లక్ష్మీకాంతంగారే దీనికి తగుదురు. ఆయన ముప్పది ఏండ్లనుంచి విశ్వవిద్యాలయాల్లో ప్రధానాధ్యాపకుడుగా ఉంటున్నారు. వారు ఈ ఆంధ్రసాహిత్య చరిత్ర చాలా మంది విద్యార్థులకు పారం చెప్పారు. దీనిని గురించి చాలా వ్రాశారు. అన్ని విధాల దీనికి వారు సమర్థులు. నేను ఏదో కవిత్వం వ్రాసుకొనేవాణ్ణే తప్ప, పట్టుమని ఒక్కదానిలో గట్టిగా కృషిచేసిన వాణ్ణి కాను. ఆఖరుకు - కొత్తవైద్యుడికన్నా నయం అన్నట్లుగా నలభైఏభై ఏండ్ల సాహిత్య పరిచయం ఉన్నా, పట్టుమని నేను దేనిజోలికీ పోను. పోతే చాలా తగాదాలు ఉన్నవి. కాని ఒక విధంగా ఈపీరికను నేను వ్రాస్తే సరిపోతుంది. 'ఇందులో మేము నిష్ణాతుల' మని కంకణాలు కట్టుకొన్న వాళ్ళదగ్గరకు వెళితే ఇది ఒకకొలికికి రాగు .. నాకు క్షేమేంద్రుడు ఎప్పుడివాడైనా పరవా లేదు. రంగనాథునిఇంటిపేరు 'చక్రపాణి' అయినా పరవాలేదు 'అచ్చవెల్లివారైనా పరవాలేదు.' (9,10 పే)-18-4-65.

ఇందులో విశ్వనాథవారివినయవిధేయతలు బహిర్గతమయినా విపరీతార్థాలు తీసే మహానుభావుల కందరికీ వందనాలు.

బీజాక్షరమాల - ప్రతివారికీ కొన్ని మొగమాటాలు తప్పవు. బలవంతపు బ్రాహ్మణార్థంగా వ్రాస్తే దాని పోకడ వేరుగా కనిపిస్తూనే ఉంటుంది. ఒక్కొక్కసారి విమర్శకుడు తన స్వాభిప్రాయాలు ప్రకటించడం కుదర దనుకున్నప్పుడు వ్యంగ్యమర్యాదను పాటించడమే శరణ్యమని భావిస్తాడు. సరస్వతీబాయి గిరిగారు వ్రాసిన ఈచిన్న పుస్తకానికి (1969) విశ్వనాథ వారు వ్రాసిన అభిప్రాయం మాస్తే ఇదే విషయం స్పష్టమవుతుంది.

'ఇది ఒక గ్రంథము కాదు. అక్షరమాల అక్షరముల వాసన. ఇందులో అక్షరములు వేలు. శబ్దాలు లేవు. అన్వయములేదు. ఉన్నను వానిదారి వానిదే. ఒక పెద్ద అఱపు. ఒక పెద్ద ఆక్రోశము.

ఒక జీవుడు - ఆజీవుడు స్త్రీ. ఇప్పుడు గొప్పస్త్రీ. ఒకగొప్ప పదవిలోనున్న పురుషుని భార్య. కడిపెడు బిడ్డలను కన్న స్త్రీ. ఆమె సంతతి తామరతంపరగానున్నది. గొప్ప లౌకిక జ్ఞానము కల స్త్రీ. తన భర్త పదవికి తాను హేతువు నను కొన్నంత వివేకవతి.

ఈజీవునకు ఈఅరచిన జీవునకు సంబంధము లేదు. ఇది ఒక ఆశ్చర్యము. పూర్వజన్మవిశిష్టసంస్కారమో ఒకవిలక్షణమైన సాధనమో! కాని ఈ అఱపులో - ఆ జీవుడు-లోకము నందొక లౌకికజ్ఞానము కలవా డన్నలక్షణ మున్నది. అది యిది గ్రంథ మనిపించుచున్నది.' ఈ అఱచిన యామె కానిచో నిది సహజము. ఎవరో యోగిని యొక్క యున్మత్త ప్రలాపము.

కాని యీామె యీామె. ఈ సాధన యొక్క ఆశ్చర్యము ఈ అఱపునకు-ఈ కేకకు- ఈ ఆక్రోశమునకు-ఒక వైలక్షణ్యము తెచ్చినది. ఇట్టి సాధన నాన్యతో దర్శనీయము. పరమేశ్వరుడు విన్నాడు. వినక తప్పదు. ఇది అట్టికేక.' (అనంతరాగం 223, 224 పే)

చిట్టచివర 'పరమేశ్వరుడు' అనే పదం 'విశ్వనాథు'డనే అర్థం స్ఫురింప చేస్తున్న దనుకుంటే తానీ పుస్తకం 'వినక తప్పలే' దనీ ఇది ఇష్టపూర్వకంగా వ్రాసిన విమర్శ కాదనీ స్పష్టమవుతుంది

ఆంధ్రమహాభారతము - ఆదిపర్వము:- ఆంధ్రసాహిత్య అకాడమీవారు ప్రచురించిన (సాధారణ 1971) ఈ పర్వాన్ని విశ్వనాథవారే పరిష్కరించి, 'పద్యవిద్య' అనే శీర్షికతో దీర్ఘమైన ఒక పీరిక వ్రాశారు. 'ఇందులో "పద్య మనగా నేమి?" అని పృచ్ఛించుకొని 'విద్య యనగా జ్ఞానము .. విద్యయనగా నొక నేర్పు. ఒకభగవత్ప్రసాదితమైన విషయములను సంయోగపరచుటలో వివేకము భాసించునట్లు చేసెడి క్రియాదీప్తి' అని చార్వ్యాది విద్యలను వివరించి కవిత్వంకూడా ఒక విద్య అనీ, అది షట్గణయతి ప్రాసల కూర్పు మాత్రమే కాక దానివెనుక ఒకశిల్పమున్న దనీ ఈ పద్యవిద్యను ఆంధ్రభాషలో సృష్టించినవాడు నన్నయ్యగా రని ప్రకటించారు విశ్వనాథ.

సాధారణంగా సమానార్థకాలుగా వాడబడే వాఙ్మయం, సారస్వతం అనే పదాలను వివరిస్తూ, వృత్తిరీతి శయ్యాపాకములు మహాకవులయందు భిన్నభిన్నములుగా నుండి యొక మహోన్నతమైన లక్షణమునుపొంది సారస్వతమగుచున్నది. తేలికమాటల కూర్పుతోడి వేయిగ్రంథములు వాఙ్మయము కావచ్చును. సారస్

# గ్రంథసమాలోచన

## వైరభక్తి

[రచన: శ్రీ చెఱకుపల్లి జమదగ్నిశర్మ గారు. శాస్త్రి. చిత్తూరు జిల్లా. వెల తెలియదు.]

వాఙ్మయ మహాకాశమున పోతనామాత్యుడు ధ్రువ నక్షత్రము వంటివాడు. భక్తితత్త్వములను కవితా మాధుర్యమున మేళవించి (రంగరించి) అగదంకారుడైనవాడతడు. ఆ భక్తితత్త్వముల నుద్బోధింపవచ్చిన యుద్గ్రంథము వైరభక్తి. దీనిని రచించినవారు శ్రీ జమదగ్ని శర్మగారు. వీరి కవితాభక్తులు జ్వాల దగ్ని శిఖా సమ్మితములు. వీరు మంచికథకులు, భావుకులు, తత్త్వాన్వేషకులు. తాము గమనించినదానిని సహృదయుల కందింప నుత్సహించినవారు. ఒక్కొక్క సంఘటన యొక్కొక్కరి కొక్కొక్కవిధముగా స్పందన నిచ్చును. మానవుని ప్రకృతి జిగీష సాధారముగా గొని వైరభక్తి నావిష్కరించిరి.

వైరభక్తిలోని పద్యముల సంఖ్య 396. ఇది యారాశ్వాసముల గ్రంథము ప్రతి యాశ్వాసములోని పద్యసంఖ్య అరువది యారు. ఈ మొత్తము పద్యముల సంఖ్య 18 లేక తొమ్మిదియగును ఇదియంతయు వీరికి గల సంఖ్యాశాస్త్ర వైదుష్యమునకు తాత్త్వికచింతనకు తార్కాణము. ఈ గ్రంథము శ్రీ వేణుగోపాలస్వామి వారి కంకితమై వదాన్యశేఖరులు శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యముగారి పోషకత్వమున ప్రకటితమైనది. ప్రథమాశ్వాసమున జయవిజయుల శాప వృత్తాంతము, వారియవతారములు, శిశుపాలుని జన్మవృత్తాంతము (ప్రధానముగ) సాత్వతీ ప్రార్థన, మున్నగునవి యున్నవి. ద్వితీయమున రుక్మిణీ జననము, కృష్ణానురాగము, శిశుపాలునితోడి వివాహ ప్రసంగము, రుక్మిణి యగ్నిద్యోతనుని కృష్ణునికడకుఁ బంపుట రుక్మిణీ విషాదము ప్రధానములు. తృతీయమున నగ్నిద్యోతనుడు కృష్ణునిఁ జేరి, యాతిథ్యము నందుట, కుండినకు శ్రీకృష్ణుని దెచ్చుట ముఖ్యములు. చతుర్థమున రుక్మిణి ప్రార్థన, హరణము, రుక్మి పరాభవము, శిశుపాల రుక్ముల పరస్పర సమాశ్వాసనము, రుక్మిణీ కృష్ణుల వివాహము వర్ణితములు. పంచమమున శిశుపాలుని దౌష్ట్యములు వాని స్వగతము ముఖ్యములు. షష్ఠమున ధర్మజుని రాజసూయాచరణము కృష్ణుని పూజించుట, శిశుపాలుని దుర్వాచనములు, వాని సంహారము, ప్రముఖములు.

వైరభక్తిలో రుక్మిణీకల్యాణము ప్రధానమైనది. జయవిజయుల మొదటి రెండు జన్మలు (హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణకుంభకర్ణులు) వర్ణితములు. మూడవ జన్మలోని శిశుపాల దంతవక్త్రులలో రెండవవా రిందు లేరు. కారణము తెలియదు. పోతనామాత్యుని రుక్మిణీ కల్యాణమునకు, నన్నయ శిశుపాలవధకును, వైరభక్తికిని సంఘటనాదులలో కొంత విభిన్నత కలదు. ఇట్టి భేదమువలన కవి సాధింపదలచుకొనిన దేమి యనిపించును.

జయ విజయుల మూడుజన్మలలోను (హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు) వారి దౌష్ట్యము క్రమక్రమముగా లుప్యమానమైయుండుట కానవగును. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, భూమిని జుట్టుట మున్నగువానితో లోకోపద్రవ మొనరించిరి. రావణ కుంభకర్ణులలో రావణుని దౌష్ట్యము సీతాపహరణమును విడిచినచో మిగిలినది దేవతాది పీడనము. దేవతలతోడి వైరము జ్ఞాతి సంబద్ధముగా నూహించుకొనవచ్చును. శిశుపాల దంతవక్త్రులలో శిశుపాలుని దుష్కర్మలు శ్రీకృష్ణ ద్వేషమును రుక్మిణీహరణజన్యమును నని యూహింపవచ్చును. 'వైరభక్తి' నామము ననుసరించి చూచిన జయవిజయుల మూడు జన్మలలోని దౌష్ట్యముల క్రమ పరిణామము సుస్పష్టము గావలెను. జయవిజయుల దౌష్ట్యము మూడవజన్మలో లుప్తప్రాయము. సంఘపరము కాదు. వ్యక్తిపరము. ఇందు రుక్మిణీ కల్యాణము నాలు గాశ్వాసముల మేర నాక్రమించుట విచిత్రముగా నుండును పురుషుడు ప్రకృతిని జయింపలేడనియు, ప్రకృతి పురుషునకు స్త్రీవలె లొంగియున్నట్లుండు ననియు వీరిభావనగాఁ దోచును. ఈ వైదాంతిక దృష్టితో వైరభక్తిని రుక్మిణీ కళ్యాణమును సమన్వయపరుప యత్నించిరి. కవిగారి తాత్త్వికదృష్టి కథలో తరచుగా ప్రత్యక్షమై పౌరాణిక వివరణ ప్రాయమై దీని కావ్యత్వమును సంకోచపఱచినదని చెప్పవచ్చును.

శిశుపాలుని స్వగతాదులవలన నతడు కావలయునని శ్రీకృష్ణునితో వైర మూనినట్లగపడును. రుక్మిణిని పంచదశిగా షోడశిగా శ్రీసూక్త ప్రతిపాదిత దేవినిగా వీరు భావించిన ట్లగపడును. అగ్నిద్యోత

---

(17 వ పేజీ తరువాయి)

తము కాదు. సాహిత్య మనిపించుకొను శక్తి దానికి చాలదు. ఇది రహస్యము'.

'. కావ్యరచనయందు కొన్నిచోట్ల వ్యుత్పత్త్యర్థములతో కూడిన శబ్దము ను ప్రయోగించుటచేత శోభవచ్చును. రూఢ్యర్థమునందు కవి ప్రయోగించును యోగార్థముచేత నొకధ్వని పుట్టును. భావమునందొక చమత్కారము జనించును.'

ఈ విధంగా సోదాహరణంగా చర్చ సాగించారు విశ్వనాథ.

(సశేషం)

నుడు శివుఁడని భావన. హనుమంతుని స్ఫూర్తిని వానిలో చూపయత్నించిరి. అగ్నిద్యోతనుడు రుక్మిణికి వార్తాహారుడై పోవుచు, తిరిగివచ్చి, పలికిన మాటలలో వాని ముముక్షుత గోచరించును. అగ్నిద్యోతనుడు శివుడైన వానికి ముముక్షుత యేమి ? ఇట్టివి పాత్రచిత్రణాదులలో కన్పించును. వైరభక్తిలో రుక్మిణీకళ్యాణ ప్రశంస నిడివి తగ్గించి మొత్తముపై జయవిజయుల మూడుజన్మలలోని దౌష్ట్యములను వానిపరిణామములను క్రమపద్ధతిలో నిర్వహించినచో వైరభక్తి సార్థకమై సుమనోమనోహర మయ్యెడి దనుటలో సందేహము లేదు. గద్యములో నైనచో మరింత రాణించెడి దనిపించును. నన్నయాదుల పాత్ర చిత్రణాదికములోని స్ఫూర్తి యిందు కానలేము. ఆశ్వాసాద్యంతముల నంకితమందిన దైవమును సంబోధించుపద్యములను వీడి మొదటి సమర్పణముతో సరిపెట్టుటలోని నవీనత గమనింపదగినది. అభినందనాశీస్సు కృతిపోషక వంశవర్ణనాత్మకము కాకుండుటయు నట్టిదే.

వైరభక్తిలో శిశుపాలుని ప్రతినాయకుని గావించుటకై రుక్మిణీకల్యాణమును పెంచవలసివచ్చినట్లు భావింపవలయును. కాని కవి యిట్టి విషయములందు జాగరూకత వహించినచో నీగ్రంథము చాల బాగుండెడిది. ముద్రారాక్షసములు మెండైనవి.

'వార్థిని బడిపోయె' (వ్యర్థమయ్యెనను నర్థమున) (1-13) హేభువనపాలక (హేయను సంబోధన నుపయోగించుట) (1-20) నా డాయన భార్యదెచ్చితి నహో యది సత్ఫల మీయలే దహో (1-29) (ఇట అహో-అహో-రెండెందులకు ?) 'పుత్రపంచకంబుపరిజగత్సవిత్రి యనన్ పృ' (2 ఆ-1) (ఇటుఉపరి యను పదము తరువాతిపదముతో సమాసమనిపించును.) 2 ఆ-7 పద్యములో శీతనగపయస్సింధుల చేరికని 8వ పద్యములో 'హరిహారపాదము ల్గడిగి చుట్లు సమాప్తైల నీయగల్గుచున్' ఇల్లానిగా ననుటచే యథాసంఖ్యము దప్పి హిమవంతుడు హరిపాదములను, పయస్సింధువు హరునిపాదములను కడిగిన ట్లర్థమీయగలదు అందే యగ్నిద్యోతనుడు 24 వ పద్యమున రుక్మిణిని 'దేవీ' యనుట విచిత్రముగా నున్నది. 42వ పద్యములో 'వారటు లేగిరి' వారెవరు ? 54 లో 'ఎతింగతింగి' ఇటకత్వాగ్రకంబగు ఇత్తునకు సంధి యైనది ఇట్టిదే 3 ఆ. లో 5 లో 'ఎతింగిటుల' యని మరొక ప్రయోగము కలదు. 3 ఆ. 51లో 'ద్వారకాపథదిదృక్షుస్విన్న నేత్రానన్', (క్రీగీటుగీచిన పదప్రయోగము విచారణీయము) 56 లో అగ్నిద్యోతనుడు రుక్మిణితో 'కేళీమోహనున్' కృష్ణుని దెత్తు ననుట సముచితతరము గాదనిపించును. 58 లో 'రుక్మిణిమణిని' సమాసార్థము విచారణీయము 4వ ఆ. 'చెట్టబుగ్గులౌ విశృతులు' క్రీగీటు గల సమాసము విచారణీయము. అందే రుక్మి పరాభవమున 'తిరుమల' ప్రసంగమును దెచ్చుట సముచితముగా నగపడదు. ఆనాటికి తిరుమల లేదుకదా ! మరియు రుక్మికి జరిగిన పరాభవమును (తలజుట్టుతీయుటను) పవిత్రమైన ప్రముక్కుబడితోఁ బోల్చుట యేమి ? 5ఆ. 1వ పద్యమున శిశుపాలుని 'స్వగతములో' ఇద్దఱియంతము చూతముగా కనున్' శిశుపాలుడు రుక్మిణిని వివాహమాడలేక రుక్మిణీ కృష్ణుల నంతము చేయ దలచుటేమి యౌచిత్యము ? 17 లో 'వాడు దుర్భేద్యుడు' క్రీగీటుగల సమాసము విచారణీయము. ఇదే పదము 35లోఁగూడ నుపయుక్తము.6ఆ.లో 7వ పద్యమున 'ధర్మరాజులకు' (ఇట బహువచనము దేనికి?) 56 లో అమ్మని స్త్రీవాచకమునకు సంధి (అమ్మ+అని) విచారణీయము. 64 లో 'బాహిరము' ఆలోచింపదగినది.

ఇట్టివింకను కలవు. శ్రీ శర్మగారి పద్యము నిరాయాసముగ నడచును. వారి కథనశైలి, పాత్రచిత్రణ, మనోహరప్రాయములుగ నుండును.

నిద్దుర మొద్దోకం డగుచు వంటి పద్యములు 'శైత్యము నౌష్ణ్యము వెలుగు జాయయువంటి పద్యములు, సర్వపారక లోకము నాకర్షించు ననుటలో సందేహము లేదు. శ్రీ శర్మగారి కవితాగుణముల నెన్నఁబూనుట దుస్సాహసము. వారు జగత్ప్రసిద్ధులు.

ఈ గ్రంథమున 'అభినందనాశీస్సు' సమర్పణము, (రచయిత) రసామ్నాయము (శ్రీమల్లంపల్లి శరభయ్యగారు) వినతి (రచయిత) మిత్రసంమోదము (శ్రీతుమ్మలపల్లివారు) వైరభక్తి (శ్రీ మల్లంపల్లివారు) కలవు. అభిప్రాయములిమ్మట వినతి, అభినందనాశీస్సు, సమర్పణ యున్నచో బాగుండెడిది; ఒకే రచయితవి (రసామ్నాయము, వైరభక్తి) రెండిందు దేనికో ? రసామ్నాయము రసాయనతుల్యమై సుమనోసుమనోహరమై యున్నది. శ్రీ తుమ్మలపల్లివారి మిత్రసంమోదము ప్రశంసాపరాయణమై యున్నది. వారు భక్తితత్త్వమును కొంతగా వివరించిరి. వారి సాధనాజ్ఞాన మందు ప్రస్ఫుట మగును. శ్రీకవిసమ్రాట్టులను తలపింపజేయగల రనిరి.

ఈ విధముగా నీ గ్రంథము బహుధా చిత్రితమై కవికిగల సర్వతోముఖ ప్రతిభను, మంత్రాది బహువిషయములను, భక్తివైచిత్ర్యమును, కవితాపరిణతిని, వేయేల బహువిషయక పరిజ్ఞానమును వెల్లడిచేయుచున్నది. శ్రీ శర్మగారి యత్నము సర్వథా ప్రశంసనీయము. ఇది వారి తాత్త్వికదృష్టినే కాక వారి పరి

# ప్రేయసి

'నిశాపతి'

ఎట్టి శాపవశమ్మున ఇలను జారి
పడితివో నాదు భగ్నజీవనము దనుప
ప్రేయసీ! ఎన్నడో వచ్చి ప్రీలినట్టి
హృదయశకలాల గూర్పగ కదలినావు.

కేల నరచాటువడిన చెక్కిళులయందు
ఆ మెరుపు లవ్వి యేమి కన్యాలలామ
విశ్రమింపగ బోయెడి వృద్ధభాను
వట్లు; ఉదయించు తరుణశశాంకునట్లు
ఎవి గూఢ మహాంధకారాన లీన
మైన నైశ్శబ్ద్య హృదయమవగు దోదేవి?
ఏశరద్యామినీ దీధితీశతముల
నణగి యున్నట్టి చైతన్య మగుదో నీవు!

అమవస నిశీథినీ నిగూఢాంక మందు
నధివసించిన తారకావధువుహృదిని
యోగ సుందర సుస్నిగ్ధ రాగ రంజి
తమ్మృదుల మధుర చంచలత్వ మగుదో నీవు

నుహిత ప్రాచీరుపారుణ మధురమంజు
దీధితీ స్నపితాప్సరో దివ్యతరుణ
లోచనాంత విలోకన లోలతాని
గూఢ సౌందర్య భావ నికుంజమాదో?

---

( 19వ పేజీ తరువాయి )

శీలనా వైదుష్యమును, వారికవితాస్ఫూర్తి ని స్ఫురింపజేయును. శిష్టికలోనే వారి వైశిష్ట్యము కన్నులకుగట్టును. సువర్ణముఖీ శ్రీ జ్ఞానప్రసూనాంబికా శ్రీకాళహస్తీశ్వరసన్నిధానముగల వీరివాక్కు సువర్ణముఖరము కాక మరే మగును? వీరు చేపట్టిన కావ్యప్రక్రియ విలక్షణము, ప్రశంసనీయము ననుటలో సందేహము లేదు. వీరింకను నిట్టి విలక్షణప్రక్రియలలో కావ్యనిర్మాణము గావించి యాంధ్రజాతి కానందము కలిగింపగల రని యాసింపవచ్చును.

— శ్రీ గౌతమ

# కవితావతరణము

విద్వాన్-మధురకవి-
వారణాసి వేంకటేశ్వరులు

తొలికాలాన వినీల నీరదము లం
దుండోఁచు శంపాలతా
విలసచ్ఛుందర కాంతిసంతతులలో -
విస్తార విఖ్యాత ని
స్తుల శృంగార కలాకలాపరుచి సం
శోభించు శైలేశు మం
జుల దృశ్యావళిలో విలాస వితతిన్
జూపింతువే కైతరో!

శరవేగమ్మున భూరిభూధర శిర
స్థానమ్మునందుండి సా
గర సాంగత్య సముత్సుకత్వ మది పొం
గన్ బారవశ్యమ్ముతో
ధరణిం బడ్డదనంగఁ బొల్చు జలపా
తస్ఫార శృంగార వై
ఖరిలో నద్భుత హావభావ చయముం
గల్పింతువే కైతరో!

భంగానీక మభంగమై పొరలి క్రే
వల్ నింపి యానింపఁగా
రంగచ్ఛృంగ విహారయై హిమగిరీం
ద్రప్రాభవోత్సాహ యౌ
గంగాశైవలినీ ప్రవాహ విలస
ద్గాంభీర్య సౌందర్య మం
దుం గల్యాణ నిధాన భావముల నె
న్నో యెన్నదే కైతరో!

పుంజములై నికుంజములఁ
బూచిన పుష్పవికాస వీథిలో
సంజలయందుఁ బళ్ళను ది
శారమణీ రమణీయ వక్త్రపున్
మంజులకాంతిలోఁ గుసుమ
మాస మనోజ్ఞ మహోదయమ్ములో
సంజనియింతువో కయిత!
సారకవీంద్ర మనోజ్ఞశోభితా!!

కోకిలపాటలో - నళుల
కోటుల ఝుమ్మను తేటగీతిలో -
కేకుల యాటలో - ననుఁగుఁ
గీరపు మాటలలో - వరాళికా
నీక విలాసపు న్గతుల
నీటులలో - హారిణాల చూడ్కిలో
ఓకవితా! కళావిలస
నోజ్జ్వల ఘట్టములన్ సృజింతువే!

కవితరో! మేల్పసిండి రుచి
కన్నను మిన్నగు గున్నమావి లేఁ
జివురు పసందులో - సొబగుఁ
జిందు వెలంది బెడంగు మోవిక్రొం
జవుల హొరంగులో - మిసిమి
చాయల పాపని పాలబుగ్గలో
మివుల వెలుంగు బల్దలఁపు
మీఁగడలన్ వెదలింతు వెంతయున్

చాల సుఖాలవాలమగు
శాంత వసంత నిశాంత వేళలో
లీలలఁ దేలియాడఁగఁ గ
డిందిగ మంద సుగంధ వాయువుల్
పోలఁగ వీచునట్టి పరి
ఫుల్ల లతాంత నితాంత కాంతిలోఁ
గ్రాలఁగఁ జేయు భావన సు
ఖమ్ము ముదమ్ము గదమ్మ కైతరో!

చిన్నెలు వన్నెలున్ జవము
జీవము నందము చందమున్ సుసం
పన్నతఁ జెన్నుమీఱి, యస
మాన యశాన, సదా జగాన దీ
వ్యన్నవ కాంతిమంతముగ
భాసిలు మంజుల శిల్పకల్పనా
భ్యున్నతిలో వెలార్తువు మ
హోన్నత మార్దవ భావ మాధురిన్.



# కవిత్వ మొక తీరని దాహం

— శ్రీ సోమసుందర్

ఒక లఘుకవితకు పతాకసన్నివేశంగా శ్రీశ్రీ- 'ప్రపంచమొక పద్మవ్యూహం... కవిత్వ మొక తీరనిదాహం!' అనే పాదద్వయాన్ని ఘటింపచేశాడు. ఆ కవితలో ఆద్యంతం-కవితావస్తునిర్దేశంతో ఆధునిక భావధారను ప్రతిపాదిస్తాడు అందుకై మూడు ఆవృత్తాలుగల పట్టిక చేర్చాడు.

ప్రాచీనాలంకారికులు ఉదాత్తకావ్యవస్తువుండా లనీ, ధీరోదాత్త ధీర లలితాది కావ్యనాయకవర్ణనాదు లత్యంత ప్రధానమనీ ఉత్తమకావ్యలక్షణం నిర్వచించారు. కాని దాని స్థానంలో శ్రీశ్రీ ఆధునిక కవితకు జీవనదర్శనమే ప్రధానమనీ, స్వీకృత మయ్యే వస్తువు గౌణమనీ-ఏ వస్తువు కావ్యరచనకు ఉపలబ్ధమైనా- కవి భావుకత్వమే ప్రతిపాద్యం కాగలదనీ సూచించాడు. సాధారణ వస్తుసంచయంనుంచి- అసాధారణ కవితాసందర్శనం వెలార్చడమే కవిప్రతిభకు నికషం కాగలదు. కవికి కావలసింది అంతర్దర్శనం. లోకవృత్త పరిశీలన ద్వారా కవి కేర్పడే తాత్త్వికదృక్కోణంపై-దర్శనం ఆధారభూతమౌతుంది. అని శ్రీశ్రీ నర్మగర్భంగా ప్రతిపాదించాడు. ఉదాత్తవస్తువు సంసిద్ధమైతే తప్ప ఉత్తమకవితా సృజన సాధ్యంకా దనే ప్రాచీనుల అవగాహన- ఆధునిక దృష్టికి సరిపడ దనే శ్రీశ్రీ ఉద్ఘాటించదలచాడు. దానికోసమే అంతకుపూర్వ మెన్నడూ కవితావస్తువులుగా పరిగ్రహింపబడని, కనీసం ఊహించనైనా వీలుకాని వస్తువుల పట్టిక కావ్యవస్తు భండారంగా చేర్చి, ప్రాచీన వస్తునిర్దేశాన్ని ఎగతాళిచేశాడు శ్రీశ్రీ. వస్తుపరిగ్రహణము ననుసరించే కావ్యఉదాత్తత ఏర్పడుతుం దనే ప్రాచీనుల విశ్వాసాన్ని త్రోసిరా జన్నాడు.

వస్తువు సామాన్యమైనదైనా కవి భావుకత్వంపై కవితాగుణం ఆధారపడుతుందే తప్ప-ఎంత ఉత్తమమైనదైనా వస్తువే తనంత తానుగా కావ్యస్వరూపాన్నందుకోజాల దని శ్రీశ్రీ ధ్వనించాడు. కావ్యానికి వస్తువు కేవలం ముడిపదార్థం వంటిదే! కావ్యనిర్వహణనైపుణ్యం కవి ప్రతిభాజన్యం. ప్రతిభ ననుసరించే ఒక రచనకు కావ్యత్వమబ్బేదీ లేనిదీ తేలుతుంది. కేవలం వస్తువు ననుసరించి కాదు. దానికోసం కవికి జీవితదర్శనం ఉండాలి.

ఐతే కవి కెదురయ్యే జీవితం ఎలాంటిది? బహుసంకులమైనది. పద్మవ్యూహమంత సంకులమైనది. ప్రపంచ మొక పద్మవ్యూహం అనే శిఖరాయమాణ ప్రతిపాదనలో-పద్మవ్యూహం అనే పదబంధంపై శ్రీశ్రీ గొప్ప ధ్వనిని ప్రపంచించాడు. వ్యూహ విచ్ఛేదననైపుణ్యం గల మహారథి దానినుంచి బయటపడగలడు. లేనివాడు మహాభారతంలోని అభిమన్యునివలె అంతరించిపోతాడు. అదీ కవి చెప్ప దలచినది. ఈ ప్రపంచవ్యూహ విచ్ఛేదన మెలా సాధ్యమవుతుంది? కవికిగల తాత్త్వికదర్శన నిష్ణాతృత్వంవల్ల నని తాత్పర్యం. ఈ నిష్ణాతృత్వం కవి ఎలా సాధించగలడు? కవిత్వ మొక తీరని దాహంగా పరిగణించడంవల్ల. అంటే కవితాధ్యయనం, అభ్యాసమూ, ధారణాదులతో కవి నిరంతరాయంగా కవితావ్యవసాయం సాగించడంవల్ల! తీరని దాహం అనడంలో కవి సంతృప్తిపొందక కృషిసల్పుతూ, వస్త్వతీత నైశిత్యం అలవరచుకోవా లని అర్థం.

ఒక సామాన్య వస్తువునైనా అసామాన్య భావుకత్వంతో దర్శించడం, దర్శించిన సారాంశాన్ని మనోహరభావజాలంలో నిబంధించడం, అట్టి భావాలను సముచితరీతిలో పదవిన్యాసంతో అభివ్యక్తంచేయడం అనువాటి ద్వారానే రమణీయకవిత వెలార్చబడుతుంది. అంతే తప్ప-కేవలంవస్తువే ఎంత ఉత్తమమైనదైనా, ఎంత ఉదారమైనదైనా, తనంత తానుగా కవితాస్వరూపాన్ని సంతరించుకోజాల దని శ్రీశ్రీ తాత్పర్యం. ఈ బుక్కు లనే ఖండికద్వారా ఒక వినూత్నతాత్త్వికాంశను ప్రతిపాదిస్తున్నాడు. పైకి ఉత్తవస్తువుల పట్టికలాగ, దేనినో హేళన చేయడానికి రాస్తున్న వికటకవిలాగ ఆద్యంతం సాగుతుంది. కానిపతాక సన్నివేశంతో పాఠకుడు వెనుదిరిగి పునరాలోచించుకోవలసిన నైశిత్యం భాసిస్తుంది. 'కాదేదీ కవిత కనర్హం' అన్న సత్యమే కవి ప్రతిపాదించవలసినది. దానికై ఒక సంవిధాన చాతుర్యం ప్రయోగించాడు.

మూడేసివస్తువుల పట్టిక తర్వాత వరుసగా రెండేసి దీర్ఘపాదాలు గల మూడు ఆవృత్తాలు కల్పించాడు. అవి "హీనంగ చూడకు దేన్నీ, కవితామయమేనోయ్ అన్నీ; నీవైపే చూస్తూ ఉంటాయ్, తవ లోతు కనుక్కోమంటాయ్; కాదే కవిత కనర్హం, ఔనౌను శిల్పమనర్ఘం అనే వాక్యాలు మూడుస్థాయుల్లో మూడు భావతరంగాలను ఉత్సేకిస్తాయి. అవి వస్తుసముచ్చయాల వివరణ తర్వా శిల్పీకరించడం వల్ల- వస్తువులెట్టివైనా ద్రష్టకు గల తాత్త్విక అంతర్వీక్షణంపై ఆధారపడుతుందన్న రశ్మి ప్రసరిస్తాడు.

కవిత్వ రచనకు దర్శనం ఎంత అవసరమో వాక్కుసైతం అంతే అవసర మ శ్రీశ్రీ సూత్రం. అప్పుడే కవితావేశం ర నిర్దేశాన్ని సాధిస్తుంది. శోభావేశంగ భాసిస్తుంది. ఈ వాక్యాలతో కవి తాన చెప్పదలచినది పూర్తిఅయింది. కాని నిజానికి పూర్తి కానేలేదు. మౌలికంగా చెప్ప దలచిన రహస్యం-ప్రపంచ మొక పద్మవ్యూహం, కవిత్వ మొక తీరనిదాహం అనే ఒక వినూత్నసత్యం! కవి దర్శన

లోనుంచి తేలివచ్చిన ఈసత్యాన్ని బలోపేతంగా చెప్పడానికే కవి ఒక సంవిధానాన్ని అనుసరించాడు. ఏ ఆర్భాటమూ లేకుండా అలవోకగా చెబుతున్నట్లు, స్థూలదృష్టికి సామాన్యవస్తువుల పట్టిక వంటిదాన్ని పేర్చాడు. సామాన్య లీకవితలో ఏముందని చప్పరించేటట్లు అనాయాసంగా (Non Assuming) రచన సాగుతుంది. చివర ప్రతిపాదింపబడిన సత్యం మాత్రం గోపురదీపంగా భాసింపచేస్తాడు.

కవికి కావలసిన ప్రాథమిక లక్షణాలను గురించి ఒక ప్రాచీనకవి చెప్పదలిస్తే-ఎంత పటాటోపం చేస్తాడో ఈ క్రింది పద్యం పరిశీలిస్తే సుబోధక మవుతుంది.

'భావం బెక్కుడలేక, వృత్తనియమా
పాయంబుచింతింప కెం
దేవర్తించి పరార్థవంచనలచే
దీపించి మూర్ఖాళిసం
భావింపన్ వ కవి ప్రణీత కృతి సా
మాన్యాకృతింబొల్చి పై
పై వన్నెల్ పచరింప దాని తిలకిం
పం బోరు ధీరోత్తముల్!'

అని చెప్పిన పద్యంలో సైతం ధీరోత్తములు తిలకింపవలసిన కవితా లక్షణాలెలాంటివో వక్రోక్తిలో ప్రతిపాదించడమే ఆకవి లక్ష్యం! ఐతే రామరాజభూషణకవి దానికోసం ఎంత సమారార్భాటం చేశాడో- ఎంతనిండా పటాటోపం సంధించాడో పరిశీలకులు గ్రహించగలరు. రామరాజభూషణుడాయుగానికి చెందినవాడైనట్లే శ్రీశ్రీ ఈ యుగానికి చెంది, ఈ యుగీనవాణిని అభివ్యక్తం చేస్తాడు టి. ఎస్. ఎలియట్ చెప్పినట్లు The change of sensibility demands a change of idiom···Sensibility alters from generation to generation,in everybody whether we will or not, but ex-pression is only altered by a man of genius ·

వర్తమాన సాహిత్యవిపణిలో కవిత్వాని కున్నంత నిరాదరణ మరే ప్రక్రియకూ లేదు.అటు సినీమాల ప్రాపకమో, ఇటు అధికారుల ఆదరణో లభిస్తేతప్ప ఏకవికీ ఆర్థికంగా వనరులు లభించడం లేదు. ఏకవితకూ చెలామణీ కలగడం లేదు ధారావాహిక నవలలకూ, వారకాంతా [వార-కాంతా] పత్రికల కాలక్షేపంకథలకూ ఉన్నంత గిరాకీగాని, ప్రచురణకర్తల ప్రాపకంగాని, కవులకు దొరకదు. అష్టకష్టాలకూ లోనై కవి తానుగా తన కవితాసంపుటిని ప్రచురించుకున్నాడో ఏదోవిధంగా వదుల్చుకుందుకే ఒకదశాబ్దకాలం పడుతోంది. అదైనా ప్రఖ్యాత కవుల గ్రంథాలకు పట్టే అదృష్టమే. అయితే తక్కుంగల వర్ధమానుల పుస్తకాలు తుక్కు కాగితాలకు పోవలసివస్తోందన్నా అతిశయోక్తి కాదు!

భౌతికపరిస్థితులు కవిత కింత అననుకూలంగా ఉన్నప్పటికీ - యువరచయితలు సృజనాత్మకంగా చప్పున ఆకృష్టులవుతున్నది కవితాప్రక్రియకే! సాహిత్యాభిమానం ఉన్న ప్రతి యువకుడూ అంతో ఇంతో కవితారచన కుపక్రమిస్తూనేఉన్నాడు. ఏదో ఒక స్థానిక పత్రికలోనైనా తన కవితలను అచ్చువేస్తూనేఉన్నాడు. భారతివంటి ప్రథమశ్రేణి సాహిత్య పత్రికలోనే ఆదరణ లభిస్తే ఆ యువరచయిత కవితా రథారూఢుడైనట్లే తృప్తి పడుతున్నాడు.

వ్యాపారరీత్యా ఇంత స్వచలనరాహిత్యం (Immobitity) ఎదురవుతున్నా కవిత్వం మాత్రం యువహృదయాలకు ప్రథమశ్రేణి సాహిత్యకళగా ఆకర్షణ కలిగిస్తూనేవుంది. దీనికి కారణం సూక్ష్మంలో మోక్షం అన్నట్లు కొద్దిశ్రమతో గొప్పకీర్తిసోపానాన్ని అధిరోహించాలనే దురాశ మాత్రమే ననడానికి తార్కాణాలు కానరావు. కవిత్వానికి ఆకర్షితులవుతూన్న యువతరం ప్రధానంగా కవిత్వ పాఠకులు. తమకు పూర్వం పుట్టి కీర్తిమంతు లవుతూన్న కవులందరి రచనల పట్లా వారికి మక్కువ మిక్కుటంగా ఉంది వారాకవిత్వాన్నంతనూ పఠిస్తున్నారు. కొద్దిమందైనా అధ్యయనమూ చేస్తున్నారు మరికొద్దిమంది ఆంగ్లభాషద్వారా ఇతరదేశాల సమకాలీన కవులను పరిచయం చేసుకుంటున్నారు. అలాంటివారికి తమ హృదయాలలో మరుగుతూన్న భావావేశాలను వ్యక్తంచేయాలనే కుతూహలం కలుగుతుంది. మనసు అభివ్యక్తికోసం తడుముల్లాడుతుంది. అనుభూతి ఒత్తిడి కలిగిస్తుంది. రీతికోసం, పదాలకోసం హృదయం తహతహలాడుతుంది. తమదైన గొంతు విప్పి కవితాప్రక్రియలో తమ కవితాహృదయాన్ని వెలువరించాలని ప్రయత్నిస్తుంది.

ఇలాంటి యువకులకు భాషాపాటవం లేకపోవచ్చు. సంవిధాన చాతుర్యం అలవడకపోవచ్చు శిల్పవిన్నాణమూ స్వాధీనం కాకపోవచ్చు. కాని వారిలో కవితాభావుకత్వం పుష్కలంగా వుంది. అనుభూతి సహానుభూతులు సాంద్రతరంగా ఉంటాయి. దేనికయినా చప్పున చలించే కవితాహృదయ నైశిత్యమూ ఉంది. అట్టి యువకులు సావధానచిత్తంతో ప్రతిఅభివ్యక్తిని నిశితంగా తీర్చిదిద్దుకోగలిగితే-వారి కవితా భావశకలాలు చదువరి గుండెలకు గుచ్చుకుని నిలిచేశక్తిని అలవర్చుకుంటాయి. తాము పూర్తిచేశామని తృప్తిపడుతున్న కవితాసృజనను మరోమారు అధ్యయనబుద్ధితో పరిశీలించుకొంటే-సంవిధాన విషయంలో, భావాభివ్యక్తి సందర్భంలో మరింత మెరుగులు దిద్దుకోగలిగితే అది ఉత్తమకవితగా భాసిస్తుంది! అంటే రచయిత తనరచననే పరాత్మకంగా పరీక్షించుకోవాలి. ఈపరి

శీలనకు ధ్యానం అవసరం. ఆధ్యానమగ్నతను ప్రతియువకవీ ఆరంభంనుంచీ అలవర్చుకోవాలి ఈ ధ్యేయం ఉన్నపుడు యువకులు రాసే ప్రతికవితా రమణీయ రసరేఖలతో తీర్చిదిద్దబడుతుంది. వారిలో సహజాతంగా మోసులు వారుతున్న ప్రతిభ సక్రమపథంలో అభివ్యక్తమవుతుంది. సృజనశక్తి పెంపెసలారుతుంది. ప్రతిభను నిత్యాహారంగా పరిరక్షించేది వ్యుత్పన్నత. అంటే బహుగ్రంథపఠనం ద్వారా, లోకవృత్తావలోకనంద్వారా మనసునిండా నింపుకొన్న జ్ఞానం. దీనిపై యువతరం బుద్ధిని కేంద్రీకరించాలి.

ఒక కవితారచన పూర్తికాగానే నిర్దుష్టస్వరూపం సిద్ధించినట్లు ఎవరూ తృప్తిపడకూడదు. వ్రాత ముగిసిన మరుక్షణంలో ఏదో ఒకపత్రికకు పంపి అర్జంటుగా కీర్తి పొందాలనే ఉబలాటానికి లోనైన 'ఆశావాదికి' అపకీర్తి లభించడంలో అబ్బురంలేదు. తనరచనను మరింత సౌందర్యవంతంగా మరింత తీక్ష్ణంగా సంతరించడమెలాగ అనే తపన ఆ రచయిత హృదయాన్ని విడువకూడదు. రాయబడినరీతితో, అభివ్యక్తసంవిధానంతో ఆరచనకి పరిపూర్ణత్వం సిద్ధించిందా లేదా అనే నిశితపరీక్షకు తానుగా పూనుకోవాలి. అంటే సృజనాత్మకచర్య పూర్తికాగానే ఒకరచయిత విమర్శకుడుగా తనరచనను సొంతం పరిశీలించుకోవాలన్నమాట!

ఒక భావశకలం ఒకనిహృదయంలో స్ఫురించి, కవితగా మలచాలన్న తీవ్రకాంక్ష ఉత్పన్నమైన మరుక్షణంలో దానిని పరిపూర్ణచిత్కళగా తీర్చిదిద్దడమెలాగనే ప్రశ్న ఉద్భూతం కావాలి. దానికెంతో అభ్యాసం అవసరం. రచయితకు లోచూపు ముఖ్యం. గవేషణ ప్రధానం. ఇవి పూర్వరంగంలో సంసిద్ధం కావలసిన ప్రాథమావసరాలు. ప్రథమ రచనాస్వరూపంలోనే ఎంతసిద్ధిపొందిన రచయితకైనా పరిపూర్ణకళామయరూపం ఏర్పడదు. ఐతే అడుగడుగునా పరితృప్తి ఎదురైతే కళాహృదయం అభివృద్ధి చెందదు. ప్రతికవితా అనితరసాధ్య మనిపించేటట్లు భాసించదు. పాఠకునిగా తననే అలరించని రచన, విమర్శనాత్మక పరిశీలనలో ఇతరేతర సహృదయుల నెలా రంజింపగలుగుతుంది? ప్రతికవితా రచనా ఈపరిధిలో విజయం పొందడానికి విశిష్ట సంవిధానస్ఫూర్తిని అందుకోవాలి. ప్రతిరచనా పునర్నిర్మాణంలో మరిన్ని అంశాలు సంతరించుకొని - నిదానంగా రూపొందాలి. దీనికై ఒకకవితను ఎన్ని సార్లు మార్చి సంస్కరిస్తే అంత ఉత్తమస్థాయి నందుకోగలుగుతుం దని మహాకవుల అనుభవం మనకు విశదం చేస్తోంది. ఒక కవిత ఉత్తమస్థాయి నందుకొని పరిపూర్ణత్వం (Perfection) అందుకోడానికి ఇదే కీలకమైన రహస్యం. అన్యత్రా దగ్గరదారులు లభించవు. పైగా ఉన్న స్టాకును ఏదోవిధంగా గ్రంథస్థం చేసి విడుదల చేయాలనే పిచ్చి తొందర కూడా కవిగా ఒకనికి శ్రేయోదాయకం కాదు. సాధారణంగా ఈ ఆవేగమే వెనుకముందు చూసుకోనియ్యదు. తన రచనలలోని మేలుకీళ్ళ బేరీజు సాగనీయదు నాసిరకం రచనలను పరిహరించుకోనీయదు. అది క్రమంగా కవిగా అతని అస్తిత్వాన్ని పెంపొందనీయకుండా ఆటంక మవుతుంది.

మనసులో ఒక భావశకలమో, ఒకపదచిత్రమో తటుక్కుమనగానే కవిత రాయాలనే కోరిక కలగడం సహజమే! కాని ధారణ పరిపూర్ణం కాకపోతే - ఆ పాఠకహృదయంలో పుష్పించదు. కనుక ఇలాంటి అపజయాలనుంచి తనకవితను పరిరక్షించుకుందుకు సమగ్రంగా కవితను రివైజ్ చేసుకోవడం ఎంతో అవసరం. కాలక్రమేణా ఒక కవితలోని శక్తులుగాని, బలహీనతలుగాని ఆకవికే దర్శనమిస్తాయి. అప్పుడు ఆత్మవంచనా మేఘాలు అభ్యంతరం కాకూడదు. దర్శనతీక్ష్ణత కలగడానికికూడా ఉత్తమ కవితా వ్యుత్పన్నత దోహదం చేస్తుంది. విమర్శకదృష్టిని పెంపొందిస్తుంది. తన కవితలోని పరస్థలాలు తనకే దర్శనమిస్తాయి. వాటిని నేర్పుగా ఓర్పుతో దెక్కేసుకోగల మానసికదార్ఢ్యమూ కలుగుతుంది. అట్టి పునఃపరిశీలనలోనే కవిత నిర్దుష్ట రూపాన్ని పొందుతుంది.

పత్రికలలో ప్రచురితమైన కవితలపట్ల కూడా ఈ నైశిత్యం అవసరమే! కారణ మేమంటే నేటిపత్రికలలో కవితలను ఎన్నికచేసి ప్రచురిస్తున్నవారు ఉత్తమాభిరుచిగల పరీక్షకులు కారు. ఖాళీ కాలములభర్తీనిమిత్తమే కవితాప్రచురణ వ్యాపారం పత్రికలపరంగా సమాదరించబడుతోంది. ఈరహస్యం గ్రహించకపోవడం వల్లనే చాలామంది కవుల రచనలు - ఉత్తమరచనలు కావాల్సినవి కూడా ఉత్తనేనీరు కారిపోతున్నాయి

నేటి అభ్యుదయకవి ప్రథమశ్రేణి ప్రపంచపౌరుడు. ప్రపంచ అభ్యుదయ ఉద్యమాలకూ, ఆ ఉద్యమాలనుంచి ఉద్భూతులైన మహాకవులకూ వారసుడు. కేవలం తనభాషాసంప్రదాయాల పరిధిలో మాత్రమే అతని రచనాజీవిక సాగితే గమ్యానికి చేరదు. అతని వ్యుత్పన్నత పూర్వకాలాల కవు లెన్నడూ ఎరుగనంత విశాల పరిధిలో విస్తృతమై ఉంది. ఆ వ్యుత్పన్నతాభూమికనుంచే ఆధునిక ప్రతిభ నవనవోన్మేషశాలిని కాగలదు. ఆదిశాభిముఖంగా మనకవిసోదరు లంతా పురోగమింతురు గాక!

# ప్రకృతిలీల - "ఋతుహేల"

- శ్రీ డా. జి. బి. ఎన్. ఆచార్య, ఎం. ఏ., పిహెచ్. డి.

రస సమున్నత కవితావిరాజమాన కావ్యసత్కృతి, నవభావ సముంచిత దివ్యశోభాయమాన నవ్య సృష్టి అయిన శ్రీ సానువేదం జానకి రామశర్మగారి 'ఋతుహేల'-వారి ఆప్తమిత్రులు, బహుభాషాకోవిదులు, రసహృదయులు, ప్రముఖ చిత్రకారులు, ఉత్తమ గ్రంథకర్తలు అయిన శ్రీ సంజీవ్ దేవ్ గారికి అంకితమీయబడినది.

సర్వ విధముల తగిన నీ సాహచర్య
మబ్బి కృతికన్య సంతుష్ట యగును కరము
ఈమె కర్పాని గూర్చితి నన్నముదము
చేర డెందము పొంగ సంజీవదేవ!'

అని కవిగారు మహదానందమును వ్యక్తము చేసినారు. కృతికర్తయు, కృతిభర్తయు రసదృష్టులే యగుట విశేషము. ఈ కావ్యము నందలి కొన్ని పద్యము లింతకు మునుపు 'భారతి' పత్రికలో ప్రచురింపబడి సహృదయ సమారాధనకు పాత్రములైనవి. ఈ కావ్యము వెలుగులోనికి వచ్చుటకు పలువురు సాహితీమిత్రులతో పాటు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి సాహాయ్యము కూడ లంభించిన దని కవిగారు పేర్కొనినారు. కనుక ఈ కావ్యము యొక్క వైశిష్ట్యము చదువరులకు సులభగ్రాహ్యము.

ప్రకృతి రెండు విధములు. ఒకటి దృశ్యప్రకృతి. రెండవది అదృశ్యప్రకృతి. దృశ్య ప్రకృతి వెలుపలిది. అదృశ్య ప్రకృతి లోపలిది. వెలుపలి ప్రకృతి తన ప్రభావమును మానవ ప్రకృతిపై కలిగియుండును. అనగా మానవునకు ప్రకృతి మిక్కిలి అవసరమైన దని తెలియు చున్నది. ప్రకృతిలేనిదే మానవుడు మన లేడు. కనుక ప్రకృతియొక్క ఆగ్రహాను గ్రహములకు మానవుడు వశు డని చెప్పవచ్చును. వాతావరణ వైవిధ్యము ప్రకృతి యొక్క ప్రత్యేకలక్షణము. ఈ వాతావరణ పరిణామములను చూచియే నాటి ఆదిమమానవుడు, నేటి ఆధునిక మానవుడు తన ఆనందమును, ఆశ్చర్యమును, ఆవేశమును, భయమును, భక్తిని ప్రకటించు చున్నాడు. వైదిక ఋషులు గానము చేసిన వివిధ మంత్రములు ప్రాకృతిక వాతావరణ ప్రేరణము లని మన పెద్దలు చెప్పుచున్నారు. ప్రాకృతిక వాతావరణములో అనేకములైన మార్పులను సృజించునవి ఋతువులు. మన సంప్రదాయము ననుసరించి నియమింపబడిన షడృతువులు, వత్సరము నందు ప్రముఖపాత్రను కలిగియున్నవి. ఒక్కొక్క ఋతువు ఒక్కొక్క వాతావరణ శోభను దర్శింప జేయు చుండును. ప్రకృతిలో ఋతు ధర్మగతములైన కోమలత్వము, భీకరత్వము, గభీరత్వము మొదలైన వివిధ పరిణామములు మానవుని మనస్సును కదలించి, ఎన్నో మార్పులను సృష్టించు చుండును అందులకే మానవ జీవితము ఋతువులతో విడదీయరాని బంధమును కలిగియున్నది.

సర్వదేశములందు, సర్వకాలములందు కవుల సృజనాత్మక చేతన, ఋతువులచే ఆకర్షింపబడి కమనీయ కావ్యావతరణమునకు కారణమయ్యెను ప్రాచ్యదేశములలో ప్రకృతి కావ్యములు ఎక్కువగా ప్రభవించినవి. భారతదేశములోకూడ ప్రాచీన అర్వాచీన కవులు ఋతువులపై కావ్యము లల్లినారు. కాళిదాసు రచించిన 'ఋతుసంహారము' ప్రసిద్ధమైన సంస్కృత కావ్యము. వంగకవీంద్రు డైన రవీంద్రుడు సైతము 'ఋతురంగ' అను సంగీతనాటకమును (వంగభాషలో) రచించినాడు. ఆంధ్రకవులు ప్రకరణానుసారముగ తమ కావ్యములలో ఋతువులను వర్ణించియున్నారు. నవ్యకవులు తెలుగులో పెక్కు స్వతంత్ర కావ్యములను వెలయించుచున్నారు.

పండిత కవులైన శ్రీసానువేదం జానకి రామశర్మగారు. 'ఋతుహేల' పద్య కావ్యమును స్వతంత్ర ప్రతిపత్తితో, ప్రతిభావంతముగా రచించి, ప్రకృతి లీలను పరితలకు దృశ్యసాక్షాత్కారమొనరించినారు. శ్రీశర్మగారు ఈ కావ్యమును తమ ఆనందము కొరకేకాక, పాఠకుల ఆనందము కొరకు గూడ రచించి రనుటకు పెక్కునిదర్శనములు కలవు. ఈ కావ్యము ఏకాంత ప్రకృతితో గాక జనాంత ప్రకృతితో సంబద్ధమై యున్నది. కవిగారు కవితా క్షేత్రములోనే కాక, వాస్తవమైన పంటపొలములలో గూడ అనుభవముగల కర్షక శ్రేష్ఠు లగుటచేత గ్రామ్యజీవితమునకు చెందిన వాతావరణము ఈ కావ్యములో గోచరించు చున్నది. వ్యవసాయమునంగు, పశుపోషణమునందు కవిగారికి ఎంతేని అనుభవ మున్నట్లు ఈ కావ్యము స్పష్టము చేయుచున్నది ఇందు కవిగారి వైయుక్తిక జీవితమే కాక, సామాజిక జీవితముగూడ ప్రతిఫలించుట ప్రశంసార్హము. కవి 'రసవాది', 'ప్రయోజనవాది' అనువిషయములను ఈ కావ్యము వ్యక్తీకరించు చున్నది.

'మానవుని జీవితమునకు సత్ప్రవర్తనము వన్నెగూర్చును. సత్ప్రవర్తనము నలవరచుకొనుటకు నీతి మూలాధారము. సద్గ్రంథముయొక్క ఆశయము పాఠకుని

యందు నైతికాభివృద్ధి నతిశయింపజేయుటయే కావున కవి పారవశ్య కట్టి యవకాశము గల్పింపవలయును. ప్రవిమల మగు నీతిని బోధించుటకు కవికి ఆధారములు పెక్కులు గానరావు. ప్రకృతిస్ఫూర్తము లెన్నడును విచ్ఛిన్నములు గావు కావున ప్రకృతి నాధారపరచుకొని కవివర్యు డమూల్యమగు నీతిని బోధింపగలడు'* అని శ్రీ చిరుమామిళ్ళ శివరామకృష్ణ ప్రసాద్ గారన్నట్లు ఈ కావ్యములో రసానుభూతి ప్రధానమైనప్పటికిని, సూక్ష్మమైన 'సందేశము' కూడ వ్యక్తము చేయబడినది. కావ్యము సందేశాత్మకముగా నుండుట అభిజ్ఞుల కానంద సంధాయకమేకదా!

శ్రీ సంజీవదేవ్ గారు ఈ కృతిని స్వీకరించుచు, ఈ క్రిందివిధముగా ప్రశంసించినారు.

'సామవేదం జానకిరామశర్మగారి నిసర్గకావ్యం 'ఋతుహేల' తగినంత వాస్తవానికీ, తగినంతకల్పనకూ సంధి. ఇందులో కావ్యాత్మ-కావ్యశరీరం తగు పాళ్ళల్లో భారసామ్యం కలిగివున్నాయి. చాలామంది కవుల్లో కవిత తప్ప మానవత మృగ్యం. కవితలేని మానవతవల్ల ప్రమోదం లేకపోయినా ప్రమాదం మాత్రం లేదు. కాని మానవతలేని కవితవల్ల ప్రమోదం వుంటుందో లేదో తెలియదు కాని ప్రమాదం మాత్రం వుంటుంది. 'ఋతుహేల' మానవత గల కవిత.'♦

సహృదయులైన శ్రీ సంజీవ్ దేవ్ గారు కవితాత్మ బాగుగా నెరిగినవారగుటచే నీవిధముగా విశిష్ట దృక్పథముతో ఆస్వాదింపగలిగినారు.

ఋతువతంసమైన వసంతముయొక్క శోభను నిసర్గమనోజ్ఞముగా వర్ణించి శ్రీ శర్మగారు తమ వర్ణనకౌశలమును, భావౌన్నత్యమును వెల్లడించినారు. శోభనకనుకోలవలనుమించి ఆమ్రశాఖలచివుళ్ళు అరుణారుణములైన వనియు, అర్ధకపుంజీర నలమిన యువతియో అనునట్లుగా కొలను తామరల నావలరహించెననియు, పూలలంగులపగల్ పోఁ పల్లవునిరీతి భృంగప్రఘుండు గడితేతితిరిగెననియు, రమణీయతల ప్రదర్శనరాలో అన నట్లుగా సంజపడతి మిక్కిలిసొగసు సమకూర్చుకొనెననియు రమణీయముగా ఉత్ప్రేక్షించినారు. నవనవోన్మేషముల మహోన్నతి వహింపగా ధరణియంతయు దివ్యచైతన్యమును సంతరించుకొనిన దనియు, 'అఖిలయావత మనోజ్ఞగాథకామనలను రూపుకట్టునట్లు'వసంతమువచ్చిన దనియు వసంతాగమనమును మనోహరముగా వర్ణించినారు. ఇంకను చెట్లు చిగిరించి పుష్పించుటను ప్రస్తావించుచు -

'నిలువెల్లపూవుల చెలువొంది మాలతి
భాసించినది పుష్పవతి యనంగ
దతిజేరుకన్నియ నరసి మొగ్గలమల్లె
ప్రిదిలె హాసము సుందరదనవోలె
ఘనరాగమహిమ చిందినపూల మందార
నుతికెక్కె స్వాధీనపతికయట్లు
పతియొల్లడని యింట బడిప్రమగ్గెసంపంగె
లలన, వేగుతీ విప్రలబ్ధవోలె
తక్కగల పుష్పలతిక లుదారసరణి
సర్వముకృతజ్ఞతలతో వసంతప్రియున
కర్పణమొనర్చి సంతృప్తి నలరినట్లు
కుసుమవిసరమ్ము కైసేసికొని చెలంగె!'

అని వర్ణించినారు. 'ప్రకృతి మానవీకరణము' పై పద్యముయొక్క ప్రత్యేకత. 'స్వాధీనపతిక', 'విప్రలబ్ధ' అనువానిచే అష్టవిధనాయికల స్ఫురణమును కలిగించి, శృంగారరసపోషణమునందు తమకుఁగల నేర్పును నిరూపించుకొనినారు. వసంతుని ప్రియునిగాను, పుష్పలతికలను ప్రియురాండ్రనుగాను సంభావించుటలో శ్రీశర్మగారి ప్రబంధవర్ణనాప్రతిభ ప్రస్ఫుటమగుచున్నది. వసంతములోని పూవు, తావి మొదలైనవానిని మాత్రమేకాక, మానవులను, పశువులను గురించికూడ వివరించినారు. అనగా మానవసమాజముతో సన్నిహితమైన ప్రకృతికే కవిగారు తమ కావ్యములో రూపకల్పనచేసినారని చెప్పవలెను.

'నిన్న మొన్నటిదాక పిన్న బాలిక నేడు
వక్షస్స్థలమ్ముపై వల్లెవేచె
పుట్టినదాదిగా పుష్టిగానుండక
బక్కచిక్కినదూడ బలిసె మిగుల
పొలముల పుంతల పులుమేయు నాబోతు
జంకక కాల్దువ్వి అంకెవైచె
పాలీయ దనుచు మేపక యూరకొన్నట్టి
బర్రె పాలొసగె నిబ్బడికి మించి
సర్వసౌకర్యములతోడ సకలజీవ
లోకమురహింప తానతిలోకశక్తి
ప్రత్యణువునందు నింపి పేర్వడసె కోరి
తెలుగునేల వసంతుండు కొలువుతీరి!'

పైవర్ణనను బట్టి వసంతఋతువులో ప్రతిజీవి బాగుగా పుంజుకొనగల దని తెలియుచున్నది. ఈవిధముగా ఈ కావ్యము ఏకాంతప్రకృతితోగాక జనాంతప్రకృతితో సంబద్ధమైయున్నది.

(సశేషం)

---

* సాహితీసాక్షాత్కారము : 'కవి - ప్రకృతి' శ్రీ చిరుమామిళ్ళ శివరామకృష్ణ ప్రసాద్. పుట. 133.

♦ ఋతుహేల. శ్రీ సామవేదం జానకిరామశర్మగారు. పుట VIII.

# ఈ పక్షంలో

26-1-79 తేదీని రిపబ్లిక్ దినోత్సవమును పురస్కరించుకొని సాయంకాలం 6॥లకు రాజమండ్రి హుషారుక్లబ్బు ఆధ్వర్యమున అల్యూమినియం మర్చంట్సు అసోసియేషను హాలులో బులుసు సీతారామశాస్త్రిగారి అధ్యక్షతను సభ జరిగినది.

'వర్తమాన దేశపరిస్థితులు' అను విషయముపై చర్చ జరిగినది ప్రస్తుతం నైజీరియాలో పనిచేస్తూ సెలవుమీద రాజమండ్రి వచ్చిన శ్రీ పాణంగిపల్లి సుబ్బారావుగారు ప్రధానఅతిథిగా సభలో పాల్గొన్నారు.

అధికార ప్రాబల్య ప్రాపకాలకోసం కులమత ప్రాంతీయభేదాల్ని పార్టీ రాజకీయవాదులే సృష్టిస్తున్నారనీ అవినీతి లంచగొండితనం అన్నిరంగాలలో పెరిగిపోయిందనీ రిజర్వేషనులవల్ల ఎవరికీ ఏమీ మేలు జరగడంలేదనీ, విదేశాలలో మనదేశానికి గల కీర్తిప్రతిష్ఠలదృష్ట్యా ఇచటి యథార్థ వాతావరణం అసంతృప్తికరంగా ఉన్నదనీ వక్కాణించిరి. శ్రీ సి. నరసింహాచార్యులు ఎం. ఏ, ఎం. యిడి., బి. ఎల్. గారూ, నవభారతి గురుకులం హైస్కూలు హెడ్మాస్టరుగారు శ్రీ ఐ. తమ్మిరాజుగారూ, డా॥ మాచిరాజు రామకృష్ణారావుగారు చర్చలో ఉత్సాహకరంగా పాల్గొన్నారు.

అధ్యక్షులు అవినీతి భారత, రామాయణకాలాల్లోనూ, వేదాలలోనూకూడ ఉన్నట్లు ఉదాహరణ లున్నాయనిరి. సమర్థులైనవారు ధర్మరక్షణదీక్షతో జనానీకపు క్షేమసౌభాగ్యాలకై కృషి చేయడం వారివిధి అనిరి. చిలుకపలుకులవలె ప్రజాస్వామ్యసూత్రాలు వల్లించినంత మాత్రాన ప్రయోజనం లేదనిరి. ప్రజలకి అన్నవస్త్రాది సామాన్య అవసరాలకిలోటు లేకుండాచేసే నిరంకుశత్వమైనా ప్రజాస్వామ్యమైనా సమాదరణీయమే అనిరి. అనేకుల క్షేమంకోసం కొలదిమందిపట్ల కాఠిన్యం ప్రయోగించినా తప్పు లేదనిరి. స్వార్థరహిత త్యాగబుద్ధితో చేసే కార్యనిర్వహణలో పొరపాటులు జరిగినా ప్రజ క్షమించగల దనిరి. త్యాగ, సేవాదీక్షతో యువతరం ముందడుగు వేయాలనిరి. క్లబ్బు ప్రధానకార్యదర్శి రామకృష్ణారావుగారి వందనసమర్పణములతో సభ ముగిసినది.

*   *   *

28-1-79 న శ్రీ లక్ష్మీనరసమ్మకాన్వెంటులో శ్రీ పన్నాల వెంకట్రామయ్యగారి అధ్యక్షతను సారస్వతసమితి సమావేశము జరిగినది. కుమారి వై. వీరరాఘవమ్మ సంస్కృత కవిత్రయము అను విషయముపై ప్రసంగించిరి. వాల్మీకి వ్యాస కాళిదాసులు సంస్కృత భాషలోని కవిత్రయమనుచు వారిరచనలు ధర్మ మేధా రససంపుల్లములని ధారాళ మనోహర శైలిలో అనేకములయిన ఉదాహరణములతో నుపన్యసించిరి. శ్రీ ప్రసాద్ భారతములోని ధార్మికతను వివరించుచు నీకవిత్రయ మననుకరణీయ మనిరి. శ్రీ మెరపల సన్యాసిరావుగారు సంస్థ ఆశయములను వివరించిరి. శ్రీ సాంబశివరావు వందన సమర్పణ గావించిరి.

*   *   *

ఇటీవల రాజమండ్రి నవభారతీ గురుకులమున హరికథా సప్తాహము దిగ్విజయముగా జరిగినది. అనేక ప్రముఖ విద్వాంసులు, మంత్రివర్యులు, కళాభిజ్ఞులు ఇందు పాల్గొన్నారు. కళాప్రదర్శనము ఉపన్యాసములు, సన్మానములు, అత్యున్నత స్థాయిలో జరిగినవి. ఉత్సవాగతులైన అతిథులకు జమీందారీ ఫాయాలా వసతి భోజనాది సౌకర్యములు సమకూర్చబడినవి. ఏతన్నిర్వహణమున శ్రీ బలుసు సత్యనారాయణరావు దంపతుల ఔదార్యౌచిత్యములు ప్రశంసనీయములు.

— —

—* ప్రకటన రేట్లు *—

| | | | |
|---|---|---|---|
| కైటిలు 4 వ పేజీ పూర్తి పేజీ ఒకసారి ప్రకటనకు | | రు. | 150. |
| ,, | ½ పేజీ | ,, | రు. 80. |
| ,, | ¼ పేజీ | ,, | రు. 50. |
| మిగిలిన పేజీలలో పూర్తి పేజీ | | ,, | రు. 100. |
| ,, | ½ పేజీ | ,, | రు. 60. |
| ,, | ¼ పేజీ | ,, | రు. 40. |

కంట్రాక్టు రేట్లకు సంపాదకుని పేర వ్రాయండి.

## బి. వి. అండ్ కో., పుస్తకములు

బి. ఏ., బి. యస్‌సి., బి. కాం. తరగతుల I, II సంవత్సరముల తెలుగునోట్సు (ఆంధ్రా యూనివర్సిటీ) ప్రతులు అన్నియు అయిపోవుటకు సిద్ధముగానున్నవి. కావలసినవారు త్వరపడుటమంచిది. వచ్చేసంవత్సరమునకు మారే అవకాశమున్నందున పునర్ముద్రణము జరగదు.

ఇంటరు I, II సంవత్సరముల తెలుగు, ఇంగ్లీషునోట్సు; X తెలుగు, ఇంగ్లీషు, హిందీ నోట్సు అన్నియు స్వల్పముగా నున్నవి. ఇంటరు తెలుగు ప్రోజునోట్సు మరల నూతన ముద్రణము పూర్తి అయి ప్రతులు సిద్ధముగా నున్నవి. షట్పది నోట్సు 10 రోజులలో సిద్ధము కాగలవు.

**బి. వి. అండ్ కో.,**

6 – 8 – 7, ఇన్నిసుపేట

రాజమండ్రి – 1.

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

– సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,
Retired Telugu Lecturer, V. T. J. College,
6–8–7, ఇన్నిసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి–1.

## చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూమ్సు వెల పోస్టేజీతోసహా రు 18–00 లు ఎం. ఒ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వాల్యూములు అతిస్వల్పసంఖ్యలో మాత్రమే ఉన్నవి.

— సంపాదకుడు 'సమాలోచన'

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.